RECAP: RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHEN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, A POWERFUL GADGET WITH 10 POWERS.

EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: *SHAPE SHIFTER*- GREEN APPLE, *SPEED*-MANGO, *FLIGHT*-ORANGE, *GIANT*-WATERMELON, *STRENGTH*- RASPBERRY, *SHRINK*-LYCHEE, *INVISIBLE*-PINEAPPLE, *STRETCH*-MUSK MELON, *FISSION*-BLACK CURRANT, *FORCE FIELD*-GUAVA.




ఇంటర్-గాల్కటిక్ కొలిషన్ రెండింటి మధ్య జరిగిన కారణంగా మెట్యూర్ భూమి వాతావరణం వద్ద షొవర్ పడింది, ఈ రాళ్ళ ముక్కలన్నీ భూమివైపుకు అతి వేగంగా పడుతున్నాయి. ఏంజిల్ ఆ మార్గాన వెడుతోంది.




రామ్ మరియు శ్యామ్ అండ్ శ్యామ్ వర్ల్డ్ కప్ ఫైనల్ క్రికెట్ మాచ్‌ని వారి లివింగ్ రూంలో చూస్తూ ఆనందిస్తున్నారు.




గాలిలో ఎగురుతూ ఏంజిల్ చిత్రం కిటికీలో కనబడింది.




రామ్ మరియు శ్యామ్ ఇంకా ఏంజిల్ ఆకాశం వైపు చూస్తున్నారు. చిన్న రాళ్ళ ముక్కలు వారి కంటికి కనబడుతున్నాయి.




రామ్ రోస్‌బెరీ పాపిన్స్‌ని పాప్స్ ఆ అనంతమైన శక్తి వైపుకు బలంగా విసిరాడు; ఈలోగా శ్యామ్ గ్రీన్ యాపిల్‌ని ఐరన్ బాట్ ఆకారంలో చేసి విసిరాడు.



ఏంజిల్ సరైన షాట్స్‌ని తమ వైపుకు వస్తున్న రాళ్ళ ముక్కల వైపుగా విసరడానికి సూచిస్తోంది, రామ్ వాటిని అలాగే పాలపుంత వైపుకు తిప్పి కొడుతున్నాడు.










చిట్ట చివరికి అన్ని ముక్కలు పాలపుంతలోకే మాయమయ్యాయి ఇక భూమి సురక్షితం అయింది. శ్యామ్ వెనక్కి తన మామూలు రూపానికి వచ్చాడు. ముగ్గురూ తమ విజయాన్ని పాపిన్స్‌తో జరుపుకున్నారు.



# ఈ సంచికలో...



చందమామ Volume-2 June 2011 Issue-06





రంగయ్యే దొంగ ...21

మానవ వనరులు ...31





పిల్లిని చంపిన పాపం ...58

వికటమైన నవ్వు ...64

* పాఠకుల లేఖలు ...06
* నమ్మకం ...07
* ముందు నుయ్యి - వెనుక గొయ్యి ...09
* చందమామతో నా జ్ఞాపకాలు ...10
* స్నేహ బంధం ...11
* మృగశిర పుట్టుక ...17
* మోహం చాటేసిన మంత్రి ...23
* పిసినిగొట్టు ...27
* మిత్రభేదం-19 ...28
* కుక్క ముక్కు చల్లగా ఉంటుంది ఎందుకో తెలుసా?...33
* ఎంతకూ నిండని గోతము ...35
* విధివిలాసం ...39
* మహా మూర్ఖుడు ...42
* శిథిలాలయం-15 ...43
* నేను సైతం ...51
* అసలు దొంగలు ...62
* వాలి-దుందుభి ...68
* కెరీర్ అంటే? ...71
* చందమామ లోకజ్ఞానం క్విజ్-29 ...72
* నవ్వుల పువ్వులు ...73
* రాజ ఫలహారం ...74
* మన దేశభాషలు నేర్చుకుందాం ...76
* భారత దర్శిని ...78
* కార్యకలాపాలు ...79

**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

# వర్షాలూ, పాఠశాలలూ, కొత్త స్నేహితులూ

ఇరవై ఎనిమిదేళ్ల తర్వాత మనం ప్రపంచ కప్‌ని మళ్లీ గెల్చుకున్నాము! ప్రారంభంలో పటిష్టంగా లేకపోయినప్పటికీ, టోర్నమెంట్ కొనసాగేకొద్దీ, మన క్రికెట్ జట్టు బలం పుంజుకుంటూ వచ్చింది. ఆస్ట్రేలియా, పాకిస్తాన్ జట్లపై మన మ్యాచ్‌లు అద్భుతమనిపించాయి. శ్రీలంకతో జరిగిన ఫైనల్ మ్యాచ్‌ని కూడా అదే ఊపులో గెల్చుకున్నాము. మన శక్తిసామర్థ్యాలపై నమ్మకం కలిగి ఉండి, ఆత్మవిశ్వాసంతో వ్యవహరిస్తే ఆకాశమే హద్దుగా ఉంటుంది...

జూన్‌నెల కొత్త విద్యా సంవత్సరానికి నాంది పలుకుతుంది. వేసవి సెలవులు కూడా జూన్‌లోనే ముగుస్తాయి. పరీక్షలకాలంలో మనం తీవ్రంగా శ్రమించిన క్షణాలను గుర్తు తెచ్చుకుంటే, రాబోయే సంవత్సరంలో కూడా మన చదువులను ప్రణాళికాబద్ధంగా మలుచుకోవలసి ఉంటుందని అర్థమవుతుంది. మంచి మార్కులు సాధించడమే కాకుండా జ్ఞానాన్ని కూడా ఆవిధంగానే పొందగలం.

జూన్ 1 అంతర్జాతీయ బాలల దినం. సిరిసంపదలకు నోచుకోని వారికి మనం సాయపడాలి. త్వరలో మేము చందమామ క్లబ్‌ను ప్రారంభించదలిచాము. దీంట్లో ఆటు సరదా, ఇటు నేర్చుకోవడం రెండూ మరింత వినోదాత్మకశైలిలో ఉండేలా మేం పథకం రచిస్తున్నాము.

సెలవుదినాలు ఎలా గడిపారో, తిరిగి పాఠశాలకు వెళుతుండటం పట్ల మీరెలా అనుభూతి చెందుతున్నారో మాకు తెలుపండి. మీ సమయాన్ని ఆటలలోనే కాకుండా కొంత నిర్మాణాత్మకంగా కూడా వ్యవహరించి ఉంటారని భావిస్తున్నాము.

జూన్ నెల వర్షాలను వెంటబెట్టుకుని వస్తుంది. గత సంవత్సరం లాగే ప్రకృతిని కాపాడటం, స్నేహితుల సహాయంతో మన నివాస ప్రాంతంలో నీటిని నిల్వచేయడం ఎలా అనే విషయాలపై పాఠకులనుంచి ఉత్తరాలను ఆశిస్తున్నాము. వచ్చే నెలలో ఇందుకు సంబంధించి కొన్ని చిట్కాలు అందిస్తాము. ఈ చిట్కాలను అమలు చేయడంలో మీరు విజయం పొందారో లేదో మాకు తెలుపండి.

నీటిని ఎలా పరిరక్షించాలి అనే అంశంపై మీ ఆలోచనలను మాకు పంపండి.

– సంపాదకులు





జూన్ 2011 ₹20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :**
Patricia Pandian
**Content Head - Online :**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :**
Venki
**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :**
Prashant Pawar
**Circulation:**
circulation@chandamama.com
**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej
**Sales Officer - Circulation :**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh. Editor :- Prashant Sharad Mulekar

# పాఠకుల లేఖలు

ఆర్ట్ బుక్ రెండు సంపుటాలూ అందాయి. పేజీలు తిరగేస్తూ నేను పొందిన అనుభూతి అనిర్వచనీయం. ఇది ఎంటీవీ ఆచార్య, శంకర్, చిత్ర, వపా గార్ల భారతీయులకు అందించిన విలువైన నిధి. ఆర్ట్ బుక్ ఆద్యంతం అద్భుతం. రంగుల లోకంలో విహరింపజేసింది. దివ్యలోకాలను ఆవిష్కరించింది. పురాణ పురుషుల సన్నిధిని నిలిపింది. ఎంత చూసినా, ఎన్నిసార్లు చూసినా తనివి తీరని విచిత్ర పరిస్థితి. ఈ ఆర్ట్ బుక్ భవిష్యత్ తరాలకు మార్గదర్శిని. పెద్దలు, ఈ ఆర్ట్ బుక్‌ని పిల్లలకు చూపితే పురాణ పురుషుల దివ్య రూపాలు వారి చిన్నారి హృదయాల్లో ముద్రించుకుపోతాయి. చందమామ కుటుంబీకుల దగ్గర తప్పక ఉండవలసిన చందమామ కురిపించిన వెన్నెల ఇది. ఆర్ట్ బుక్ అందించే ఆనందానుభూతి ముందు మనం చెల్లించే మూల్యం అత్యల్పం. వెన్నెల లోకం చేరుకోవడానికి త్వరపడండి.

– ఎస్. శివనాగేశ్వర రావు, తెనాలి

అంగవికలురు, అనాథ పిల్లల కోసం కూడా చందమామ చొరవ తీసుకోవాలి. బాలవాణి శీర్షికలో వీళ్లపై కూడా కథనాలు ప్రచురించాలి. 58 ఏళ్ల ప్రాయంలో నాకిప్పటికీ చందమామ అంటే ఎంతో మక్కువ. ఈ కాలంలో కూడా చందమామ ఎంతో ఆకర్షణీయంగా ఉంటోంది. జపనీస్, చైనీస్ కథలు, జీవిత చరిత్రలు కూడా ప్రచురించగలరు.

– ప్రభాకర్ మానె, పరాలి, సతారాజిల్లా

చందమామ ఇతరులకు పిల్లల పత్రికగా మాత్రమే ఉండవచ్చు కాని, నాకు మాత్రం అది బంగారు గుడ్లు పెట్టే బాతు లాంటిది. పురాతన సంప్రదాయాన్ని ఆధునిక యుగతత్వాన్ని పుణికి పుచ్చుకున్న విశిష్టత చందమామకే సొంతం. వంద శాతం భారతీయాత్మను కలిగిన పాశ్చాత్య మేలిమి జలతారు చందమామ. కాని, ఒక బాధ మిగిలే ఉంది. ఆకాశంలో పూర్ణచంద్రుడి వంటి ఫొటో వ్యాఖ్యల పోటీని చందమామలో మళ్లీ ప్రారంభించండి.

– కేశవన్, ట్యుటికోరన్, తమిళనాడు

# నమ్మకం!

వీరాపురంలోని పెంచలయ్య ఎవరైనా తుమ్మితే, ఎంత ముఖ్యమైన పనినైనా వాయిదా వేసేవాడు. తుమ్ము అరిష్టదాయకం అని, అతడి నమ్మకం. అతడి తండ్రి గోవిందయ్య, 'ఒరే! ముసలివాడినైన నాకే ఇంత చాదస్తం లేదు. నీకెందుకురా!' అనేవాడు.

ఒకసారి పెంచలయ్యకు పట్నంలో, ఒక ముఖ్యమైన పని పడింది. సరిగ్గా బయలుదేరుతుండగా అతడి కొడుకైన గోపాలం-- పదకొండేళ్లవాడు తుమ్మాడు.

పెంచలయ్య వాణ్ణి కొరకొర చూస్తూ, 'సరిగ్గా సమయానికే తుమ్మాలా, వెధవా?' అన్నాడు.

'తుమ్ము వచ్చింది, తుమ్మాను. నేను తుమ్మితే, నువ్వు ఆగడం దేనికి?' అని అడిగాడు గోపాలం అమాయకంగా.

'తుమ్ము అనర్థదాయకం. తుమ్మిన వెంటనే పని మొదలుపెడితే, అది సఫలం కాదు,' అన్నాడు పెంచలయ్య.

'మరి ఇదే సమయానికి మన ఊళ్లో బోలెడంత మంది తుమ్ముతూ ఉండవచ్చు కదా! అవి లెక్కలోకి రావా?' అన్నాడు గోపాలం.

పెంచలయ్య విసుక్కుని 'అవన్నీ లెక్కలోకి తీసుకుంటే పనులు సాగవు. మనకు వినిపించే తుమ్ములే మనకు లెక్క,' అన్నాడు.

గోపాలం నవ్వి, 'అయితే, తాతయ్య చాలా అదృష్టవంతుడన్న మాట!' అన్నాడు.

'అదేమిటి?' అన్నాడు పెంచలయ్య ఆశ్చర్యపడి.

దానికి గోపాలం, 'అవును మరి! తాతయ్యకు బ్రహ్మచెవుడు గదా! ఎవరి తుమ్ములూ వినబడవు. ఏ బాదరబందీ లేకుండా స్వేచ్ఛగా తన పనులు తాను చేసుకుంటున్నాడు. నీకు స్వేచ్ఛ లేదు! కేవలం ఒక తుమ్ము నిన్ను కట్టిపారేయగలదు,' అన్నాడు.

పెంచలయ్యకు ఈ మాటలు చురకల్లాగ తగిలాయి. ఆ తర్వాత అతడు తుమ్ములను పట్టించుకోవడం మానేశాడు.

- వక్కలంక కిషోర్



**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamamashop.com & subscribe Now!!**



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........................................................................................

Date of Birth: .................................. Sex :.......................................

Address: ........................................................................................

........................................................................................................

........................................................................................................

....................................................... City: ........................................

State:.......................................... Pin:...............................................

Telephone:......................................................................................

Mobile:...........................................................................................

Email:.............................................................................................

Subscription Number (for renewals):...............................................

Gift Subscription to the following address:

........................................................................................................

........................................................................................................

........................................................................................................

........................................................................................................

Enclosed Cheque/DD* for Rupees..................................................

Cheque/DD No .............................................................................

favouring Chandamama India Ltd on................................................

........................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# ముందు నుయ్యి - వెనుక గొయ్యి

రామచంద్రాపురం గ్రామాధికారి రాఘవయ్య. ఆ ఊళ్లోనే శంకరం అనే వార్తాహరుడు ఉండేవాడు. పాలనాపరమైన ఉత్తరాలు, నివేదికలు రాజధానికి చేరవేయడానికి, అక్కడి నుండి ప్రత్యుత్తరాలు, ఉత్తర్వులు అందుకోవడానికి శంకరం రాఘవయ్యకు సహాయ పడేవాడు.

కానీ, శంకరానికి ఓ దురలవాటు ఉండేది. అదేమిటంటే- లేఖల్ని మార్గమధ్యం లోనే తెరిచి చదివి, మళ్లీ యధాప్రకారం ఎవ్వరికీ అనుమానం రాని విధంగా మడతపెట్టి తీసుకెళ్తుండేవాడు. శంకరం దురలవాటుని గమనించినా సరైన ఆధారం లేక, అతన్నేమీ అనలేకపోయేవాడు రాఘవయ్య.

శంకరానికి సరైన గుణపాఠం నేర్పదలిచిన రాఘవయ్య ఒకరోజు అతని ప్రవర్తనను వివరిస్తూ, అతనికి 'తగిన శిక్ష విధించాల్సింది'గా ఒక లేఖరాశాడు. ఆ లేఖని శంకరం చేతికిచ్చి రాజధానికెళ్లి కొత్వాలుకి అందజేస్తే తగు రీతిలో సత్కరిస్తారని చెప్పి పంపాడు.

అలవాటు ప్రకారం దారిలో లేఖ విప్పి చదివిన శంకరానికి ముచ్చెమటలు పట్టాయి. లేఖ తీసుకెళ్లి కొత్వాలుకి ఇస్తే నిజం తెలిసి కొరడా దెబ్బల సత్కారం జరుగుతుంది. అలాగాక వెనుదిరిగి రాఘవయ్య దగ్గరికి వెళ్లినా అతని బండారం బయటపడటం ఖాయం. అతని పరిస్థితి ముందు నుయ్యి, వెనుక గొయ్యిలా మారింది.

కొత్వాలు కొరడా దెబ్బల కన్నా గ్రామాధికారి చీవాట్లే నయం అనుకుంటూ, రాఘవయ్యని క్షమించమని వేడుకునేందుకు వెనుదిరిగాడు శంకరం.

– మల్లారెడ్డి మురళీ మోహన్



# చందమామతో నా జ్ఞాపకాలు

బాల్యం ఒక అమూల్యమైన విషయం. జీవితంలో అత్యంత విలువైన సంపద. మన చుట్టూ ఉన్న ప్రపంచంలో ఉపద్రవాల కారణంగా మన మనస్సు ఖేదపడుతున్నప్పుడు, జీవిక కోసం సంపాదించడంలో శ్రమకోరుస్తున్నప్పుడు మీ బాల్యమనే సంచిని తీసుకుని దాంట్లోని సుమధుర జ్ఞాపకాలను తెరువండి. చిన్నప్పుడు మీరు చేసిన తుంటరి పనులు, బాల్యపు మధుర స్మృతులు మీ ముఖంలో చిరునవ్వులను పూయిస్తాయి.

నేను నాలుగు లేదా ఐదో తరగతి చదువుతున్నప్పుడు చందమామ వెల రూపాయి ఉండేది. అప్పట్లో రూపాయి అంటే పెద్ద మొత్తమే మరి. మా చిన్నప్పుడు నెల రోజులకు పాకెట్ మనీగా ఒకే ఒక రూపాయి ఇచ్చేవారు. మసాలా ఘాటుతో ఘుమఘుమలాడే చాట్, కబీట్, జుజుబీ వంటి తినుబండారాలను పాఠశాల వెలుపల ఓ ముసలామె చెట్టుకింద కూర్చుని అమ్మేది. వీటితో పాటు చందమామ పత్రిక అంటే మాకెంతో ఇష్టం. ఉన్నది ఒక రూపాయి. ఖర్చుపెట్టడానికి బోలెడు వస్తువులు. ఇష్టమైన వాటిని కొని తినాలనిపించినప్పుడు చందమామ మా చివరి ప్రాధాన్యతగా ఉండేది. అయితే బేతాళ కథలు ఒక పట్టాన మమ్మల్ని నిద్రపుచ్చేవి కావు. రాజులు, రాణులకు సంబంధించిన చక్కటి కథలు మమ్మల్ని ఆనంద పరవశుల్ని చేసేవి. అప్పుడు నాకో ఆలోచన తట్టింది.



Name: Shakila S. Hussain
Occupation: Teacher,
Bhopal.

మేం ఎనిమిదిమందిమి ఒక జట్టుగా ఉండేవాళ్లం. అన్ని సందర్భాల్లో కలిసే ఉండేవాళ్లం. కలిసే తినేవాళ్లం. చందమామను ప్రతి నెలా కొనాలంటే మనందరం డబ్బును కలిసి పంచుకోవాలని నేను సూచించాను. మా స్నేహితులందరికీ ఈ సూచన నచ్చింది. ప్రతి నెలా మేము చందమామను కొనడం ప్రారంభించాము. అయితే ఆ మరుసటి నెలలోనే మాకు చిక్కు సమస్య ఎదురయింది. పత్రికను ఎవరు భద్రపర్చాలి? అప్పుడు మేమనుకున్నాము. మాలో అందరూ చందమామ చదవాలి. ప్రతినెలా ఒక్కొక్కరం చొప్పున చందమామను భద్రపర్చాలి. ఈ విధంగా మాకు నచ్చిన పదార్థాలను తినడం, అలాగే చందమామను కొనడం అనే సమస్యను మాకు మేమే పరిష్కరించుకున్నాము.

దీన్ని మేము చాలా కాలం కొనసాగించాము. నేటి పిల్లలను చూస్తే, వారి బాల్యం ఎంత అసంపూర్ణంగా ఉంటోందో అని బాధ కలుగుతుంటుంది. నేటి పిల్లల బాల్యంలో నదులు లేవు, చెరువులు లేవు. పచ్చటి పొలాలు, ధాన్యాగారాలతో కూడిన ఆనందానుభూతులు లేవు. ఈ గడ్డకు సంబంధించిన అద్భుతమైన ఆటలు లేవు, సుదీర్ఘ నడకలు లేవు. వీటన్నిటికంటే మించి ఇంట్లో అమ్మమ్మలు, నాయనమ్మలు ఊరిస్తూ చెప్పే కథలు లేవు. ఎంత విషాదమిది!

మా బాల్యం మళ్లీ మాముందు ప్రత్యక్షమయితే...!

## బేతాళ కథలు

# స్నేహ బంధం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, రాజా! నువ్వు ఈ అర్ధరాత్రివేళ స్వార్థం కొద్దీ సంచరిస్తున్నావని నాకు తోచడంలేదు. ఈ కష్టం ఎందుకు కొనితెచ్చుకుంటున్నావు అనే సంగతి నాకు అర్థం కావడంలేదు. చాలా మంది నీలాగానే పరోపకారం కోసం గోతిలో పడుతుంటారు సుమా! ఇందుకు ఉదాహరణగా మాధవుడి ఉదారత గురించీ, అతడి తొందరపాటు నిర్ణయం గురించీ నీకు చెప్పవలసి వుంది, చెబుతావు, శ్రమతెలియకుండా విను! అంటూ ఇలా చెప్పసాగాడు.

పూర్వం అమరావతి పట్నంలో ఇద్దరు బాల్యమిత్రులుండేవారు. వారిలో ఒకడి పేరు మాధవుడు. ఓడలమీద సరుకు ఎగుమతులు చేస్తూ కోట్లరూపాయిలు సంపాదించాడు. అతడికి రజనీకాంతుడనే ఒకే ఒక్క కొడుకున్నాడు. ఇక అతడి మిత్రుడు శివయ్య. మేకలను పెంచి సంతకు తోలి తిరిగి



పిల్లమేకలను కొనితెచ్చి వాటిని పెంచి అమ్ము తుండేవాడు. శివయ్యకు కూడా ఒకే ఒక్క కూతురుంది. ఆ అమ్మాయి పేరు ప్రతిమ.

మాధవుడు, శివయ్య ఇద్దరూ ఒకే బడిలో చదువుకున్నారు. వారితండ్రులు మేకలను పెంచేవారు. మాధవుడి తండ్రికి వ్యాపారం బాగా కలిసి వచ్చింది. క్రమంగా ఎదిగి విదేశాలకు ఓడల మీద వ్యాపారం మొదలు పెట్టాడు. ఆ వ్యాపారం కూడా ఆతడికి ధన రాసులు కూడబెట్టింది. శివయ్య, మాధవుడూ యుక్తవయస్కులయ్యే నాటికి వారి మధ్య చాలా తేడా ఏర్పడింది. అంత మాత్రాన మాధవుడూ శివయ్య తమ స్నేహాన్ని కొనసాగించకుండా ఆగింది లేదు.

'ఇంకా ఎంతకాలం పాటు ఆ మేకలను పట్టుకుని వ్రేలాడతావు ! నా వ్యాపారంలోకి ప్రవేశించు. నేను పెట్టుబడి పెడతాను. మా నాన్నగారు పరిచిన బాటలు ఎటూ వున్నాయి. ఆయనకు నేనెంతో నువ్వూ అంతే, నీక్కూడా ఒక్క బిడ్డే సంతానం కలిగింది కదా!, అన్నాడు మాధవుడు.

ధనవంతుల కుటుంబంతో స్నేహం కొన సాగించే విషయంలో శివయ్య తన జాగ్రత్తలో తానుండేవాడు. అందువల్ల మాధవుడి సూచనను సున్నితంగా తిరస్కరించాడు.

ప్రతిమ పెళ్ళికెదిగిన సంగతిని శివయ్యకు భార్య గుర్తు చేసింది. శివయ్య వ్యాపారం రాణించలేదు. ఇక ఆ స్థితిలో అతడు తన కూతురి వివాహం ఎలా చేయగలడో!

ఇదిలా ఉండగా రజనీకాంతుడు ఒకనాడు ప్రతిమతో తాను ఆమెను పెళ్ళాడాలన్న కోరికను బయటపెట్టాడు. ప్రతిమకు కూడా అతడంటే ఇష్టం ఉన్నది. అయినప్పటికీ తండ్రికి ధనవంతుల పట్ల ఉండే బెదురే ఆమె సైతం వ్యక్తపరచింది.

రజనీకాంతుడు విచిత్రంగా చూసి, 'అర్థం లేని బెదురది, ధనవంతులు మాత్రం మనుషులు కారా!' అన్నాడు.

అతడితో పెళ్ళికి ప్రతిమ ఒప్పుకోలేదు. ఒకనాడు శివయ్యకు డబ్బు అత్యవసరంగా కావలసి వచ్చింది. పట్నంలో ఎవరిని అప్పు అడిగినా వారంతా, 'నీకేమయ్యా, మాధవుడు వంటి ధనవంతుడు నీ స్నేహితుడు. ఆయన్నే అప్పు అడగరాదూ!' అన్నారు.

శివయ్యకు ఇక తప్పలేదు. మాధవుడిని కలుసుకున్నాడు. తన మిత్రుడికి అతిథి సత్కారం చేసి, 'మిత్రమా ! నా వలన నీకు కావలసిన పని ఉన్నాదా !' అని అడిగాడు.

శివయ్య తన మొహమాటాన్ని జయించి, 'వెయ్యి రూపాయలు కావాలి. త్వరలో తిరిగి

ఇస్తాను!' అన్నాడు. మాధవుడు సంతోషించి, అతడికి వెయ్యి రూపాయిలు అందించి, 'ఈ డబ్బు అప్పుకాదు. నీ వద్ద ఎప్పుడుంటే అప్పుడు మాత్రమే ఇవ్వు. మరింత డబ్బు కావాలన్నా సరే తీసుకో !' అన్నాడు.

శివయ్య అతడికి కృతజ్ఞతలు చెప్పుకొని వెళ్ళిపోయాడు. వెయ్యిరూపాయిలతో అతడి వ్యాపారం తిరిగి వృద్ధి చెందింది.

నెలరోజులు గడిచాయి. వెయ్యి రూపాయల్లో నాలుగో వంతు సొమ్ముతో బాటు , వెయ్యి రూపాయిలకు వడ్డీ నిమిత్తం కొన్ని రూపాయిలు కలిపి తన కూతురు ప్రతిమ చేత మాధవుడికి పంపించాడు. పెళ్ళికెదిగిన అమ్మాయితో తన సొమ్ము పంపినందుకు శివయ్య మీద మాధవుడు కోపం తెచ్చుకున్నాడు.

అయినప్పటికీ ప్రతిమను వాత్సల్యపూరితంగా తలనిమిరి, 'డబ్బుకేం తొందర వచ్చిందని మీ నాన్న పంపించాడు! అతడి అవసరం తీర్చాను అంతవరకే! ఇప్పుడు వడ్డీ కూడా లెక్క కట్టిపంపించాడు. నన్ను పరాయివాడిగా జమకట్టాడా!' అన్నాడు.

తిరిగి వెళ్లేటప్పుడు ప్రతిమను తమ గుర్రపుబండిలో పంపించాడు. మాధవ మావయ్య తననెంత ప్రేమగా పలకరించిందీ చెప్పింది ప్రతిమ.

శివయ్య ఆమె మాటలు పట్టించుకోకుండా, 'నువ్వు వడ్డీ యిస్తే తీసుకున్నాడా లేదా! అది ముఖ్యం!' అన్నాడు. ప్రతిమ తెల్లబోయి, 'డబ్బు ఇంత తొందరగా పంపించినందుకు బాధ పడ్డాడు కూడా!' అంది.

శివయ్య తన మాట మీదే తానుండిపోయి, 'నువ్వు డబ్బు యిస్తే తీసుకున్నాడా లేదా!' అన్నాడు.

ప్రతిమ నెమ్మదిగా , 'ఆడపిల్లచేత డబ్బు పంపుతాడా! అని కూడా అన్నాడు' అంది.





ప్రతిమను చూడగానే అతడికళ్ళలో దీపాలు వెలిగాయి. ఆమె కూడా ఎంతో సంతోషించింది. అయినప్పటికీ తన సంతోషాన్ని లోపల్లోపల అణుచుకుంది వడ్డీ డబ్బును అతడి చేతికి అందించింది.

రజనీ కాంతుడు నొచ్చుకుని, 'మనరెండు కుటుంబాల మధ్య స్నేహం ఎంత గొప్పదో మావయ్యకు తెలియదా ? వడ్డీ చెల్లిస్తారా ఎవరైనా, మనం మనం కావల్సినవారమైనప్పుడు ?' అన్నాడు.

ప్రతిమ నవ్వి వూరుకుంది. వాళ్ళిద్దరూ చాలా సేపటివరకూ కబుర్లు చెప్పుకున్నారు. ఇంటికి తిరిగివచ్చి వడ్డీ డబ్బును రజనీ కాంతుడు చేతికిచ్చినట్లు చెప్పింది ప్రతిమ.

శివయ్య మొహం కందగడ్డలాగా చేసుకుని, 'అలాగా, ఈసారి కొడుకు మాట్లాడాడా?' అన్నాడు. ప్రతిమ తాను విన్న మాటలు చెప్పింది. రజనీకాంతుడి మాటలు శివయ్యకు ఎలా అర్థమయ్యాయోకాని, అప్పటికప్పుడు తన వద్ద మిగిలిన గొర్రెలను, మేకలనూ అమ్మి, ఆ డబ్బును మాధవుడి బాకీ తీర్చిరమ్మని చెప్పి తన కూతురును అతడి భవంతికి పంపించాడు.

ప్రతిమ ఆ సొమ్మును మాధవుడి చేతికి అందించింది. మాధవుడు మొదట ఆశ్చర్యపోయి, అటు తర్వాత నొచ్చుకుని, 'తిరిగి నీ చేతికిచ్చే డబ్బు పంపించాడా? మా బావే ఈ సారయినా స్వయంగా వచ్చి కలుసుకుంటాడని ఆశించాను. బావను చూసి చాలా కాలమయ్యింది!' అన్నాడు.

మాధవుడి భార్య కానుకలిచ్చి ప్రతిమను తమ గుర్రపుబగ్గీ మీద పంపించింది. మాధవుడి మాటలు తండ్రితో చెప్పింది ప్రతిమ.

శివయ్య మరింత మండిపడుతూ, 'అతడి చేతికి డబ్బు అందడమే కదా ముఖ్యం! అయినా డబ్బు యిచ్చి పంపింది నా బిడ్డతోనే కదా ! డబ్బున్న వాడు ఏదైనా మాట్లాడతాడు. ఎలాగైనా మాట్లాడతాడు. అతడేమి మాట్లాడినా అందరికీ బాగానే ఉంటుంది,' అన్నాడు.

ప్రతిమ ఇక మాట్లాడలేదు. తండ్రి ప్రదర్శిస్తోన్న కోపంలో ఆమెకు ఎలాంటి సామంజస్యం కనిపించలేదు.

ఆ తర్వాత శివయ్యకు వ్యాపారంలో నష్టం వచ్చింది. అతడి మేకలమంద మీద ఒక తోడేలు దాడి చేసి రెండు మేకలను చంపింది. తర్వాత నెలలో తన మిగిలిన బాకీకి వడ్డీ డబ్బు మాత్రమే శివయ్య తన కూతురి చేత మాధవుడికి పంపించాడు. ప్రతిమ వెళ్ళిన సమయానికి అతడి కొడుకు రజనీ కాంతుడు మాత్రమే ఇంట్లో ఉన్నాడు.

'మామయ్యను ఒకసారి కలుసుకో!' అంది తండ్రితో. శివయ్య భార్యకూడా అదేమాట అన్నది. శివయ్యకు వాళ్ళిద్దరి మాటలు రుచించాయి. తనకూ, తన స్నేహితుడికీ మధ్య అంతరం పెరిగిపోయింది. డబ్బు అవసర పడినప్పుడు మాత్రమే తాను అతడిని కలిశాడు. డబ్బు తీసుకున్న తర్వాత తనలో అర్థం కాని భావన ఏదో మొదలయ్యింది. అరమరికలు లేని స్నేహం తిరిగి కావాలనిపించింది. అప్పటికప్పుడు మాధవుడి ఇంటికి బయలు దేరాడు శివయ్య.

అతడికి దారిలోనే మాధవుడి ఇంటిపని వాడు కనిపించాడు. అతడు గుర్రపు బగ్గీ మీద శివయ్య ఇంటికే బయల్దేరాడు. శివయ్యను వెంటపెట్టుకుని రమ్మని మాధవుడు పంపించాడు. శివయ్య ఆశ్చర్యపడి అతడి వెంట మాధవుడి భవంతి చేరుకున్నాడు. శివయ్య చేరిన సమయానికి భవంతి ఎంతో సందడిగా ఉంది. తన బంధుమిత్రులనుండి బయట పడి మాధవుడు అతడికి ఎదురు వచ్చి తోడ్కొని లోపలికి తీసుకుపోయాడు.

మాధవుడి ఇంటికి పోయేసరికి పెళ్లిసంబంధం వచ్చింది. సమావేశంలో శివయ్యను ముఖ్య అతిథిగా కూర్చుండ బెట్టి అతడి గురించి ఘనంగా చెప్పాడు. మాధవుడి కూతురికి పెళ్ళి సంబంధం నిశ్చయమయింది. శివయ్య ఆ వ్యవహారం తేలేవరకూ అక్కడే ఉండి గుర్రపు బగ్గీ మీద ఇల్లు చేరాడు.

శివయ్యను అతడి భార్య వివరాలు అడిగింది. శివయ్య తన స్నేహితుడి ఇంట జరిగిన విశేషాల గురించి చెప్పబోతుండగా, గుమ్మంలో మరో గుర్రపు బగ్గీ ఆగింది. బగ్గీ లోంచి మాధవుడూ, అతడి భార్య దిగారు.



శివయ్యదంపతులకు మతులు పోయాయి. మాధవ దంపతులు వారి యింట్లో సుఖాసీనులయ్యారు, 'బావా మా వాడూ, ప్రతిమ ఒకరంటే ఒకరు ఇష్టపడుతున్నారు. ప్రతిమ ఆత్మాభిమానం కల అమ్మాయి. అంతస్తుల తేడాని వూహించుకుని మావాడికి దూరంగా ఉంటూ వచ్చింది. ఈ సంగతి మీరు గమనించే వుంటారు,' అన్నాడు మాధవుడు. శివయ్య దంపతులు తలూపారు.

'బావా, ఇప్పుడు నేనే చొరవతీసుకుని కోరుతున్నాను. మీ ప్రతిమను మా ఇంటి కోడలిని చేయండి!' అంటూ నిశ్చితార్థం ఏర్పాట్లు మొదలు పెట్టాడు మాధవుడు.

శివయ్యకు తాను చూస్తోంది కలో నిజమో అర్థం కాలేదు. మాధవుడి చేతులను తన కళ్ళకద్దుకున్నాడు. ప్రతిమ సిగ్గుల మొగ్గయి ప్రక్కకు తప్పుకుంది.

బేతాళుడు ఇంతవరకు కథ చెప్పి, 'రాజా! మాధవుడి అంతస్తుతో పోల్చితే శివయ్య ఎంతమాత్రం అతడితో సరిపోలడు. శివయ్య అతడి వద్ద సహాయం పొంది కూడా దురుసుగా ప్రవర్తించాడు.

తన కొడుక్కి ప్రపంచమంతా వెతికి తగిన కన్యను తెచ్చి వైభవంగా పెళ్ళి చెయ్య గలిగి కూడా మాధవుడు తన మిత్రుడి కూతురితో పెళ్ళి సంబంధం తనకు తానుగా నిర్ణయించాడు. మాధవుడు ఎందుకంత తొందరపడ్డాడు! సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తలవెయ్యి ముక్కలవుతుంది. అన్నాడు.

విక్రమార్కుడు సమాధానంగా, 'డబ్బు ఎంత పాపిష్టిదో మిత్రులిద్దరికీ తెలియనిది కాదు. అయినప్పటికీ పేదరికం మాటున శివయ్య ఎప్పటికప్పుడు ఆ సంగతి పట్టించుకోలేకపోయేవాడు. అయితే మాధవుడు తనకీ, శివయ్యకు మధ్య ఉన్న స్నేహాన్ని ఎన్నడూ డబ్బుతో ముడి పెట్టలేదు. శివయ్య చేత వ్యాపారం నిర్వహింపచేసి అతడిని కూడా తనంతటి ఐశ్వర్యవంతుడ్ని చెయ్యాలని చూశాడు. శివయ్యలో అప్పుడు మితిమీరిన ఆత్మాభిమానం అడ్డుగా నిలిచింది. అతడికి వెయ్యిరూపాయల సహాయం చేసేటప్పుడు కూడా అదో గొప్ప సహాయంగా మాధవుడు భావించలేదు. ఆ చిన్న సహాయం గురించి మరచిపొమనే కోరాడు కూడా. కాని శివయ్య సహాయం పొందినప్పుడు ఉన్నట్లు, సహాయం పొందిన తర్వాత లేడు. తాను మాధవుడి దయాధర్మం మీద బతకడం లేదన్నట్టే నిరూపించే ప్రయత్నాలు చేశాడు.

పైగా తన ఆప్తమిత్రుడికి తన మొహం చాటేశాడు. ఓడల మీద వ్యాపారి అయిన మాధవుడిని వీధి వడ్డీ వ్యాపారి స్థాయికి దించే ప్రయత్నం చేశాడు శివయ్య. స్నేహితుల మధ్య డబ్బు పాత్ర లేదని గ్రహించినవాడు కాబట్టే మాధవుడు అతడి కూతురును తన యింటి కోడలిని చేసుకోవాలని చొరవ చూపాడు' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా ఎగిరిపోయి తిరిగి చెట్టెక్కాడు. – కల్పితం

(ఆధారం: ఎమ్. వి. వి. సత్యనారాయణ)





# మృగశిర పుట్టుక

పూర్వకాలంలో హిరణ్యాక్షుడు అనే రాక్షసరాజు ఉండేవాడు. అతడు ఘోరమైన తపస్సు చేసి శివుని వల్ల అనేకమైన వరములు పొందాడు. వరములు పొందిన ప్పటినించీ అందరినీ హింసించనారంభించాడు. హిరణ్యాక్షుని పేరు చెబితే, ముల్లోకాలలోనూ ప్రాణికోటి హడలిపోతూ ఉండేది. వాడు తన దర్పం వల్ల స్వర్గాధిపతి ఐన దేవేంద్రుణ్ణి కూడ ధిక్కరించి ఆ సింహాసనం ఆక్రమించాడు.

ఇంత చేసినప్పటికీ వరములిచ్చిన ఈశ్వరుడు సహించి ఊరుకున్నాడు. కాని, కైలాసం లోని ప్రమథగణాల మీదికే వాడు దాడి వెడలేసరికి పట్టరాని కోపం వచ్చి శివుడు వానిని శపించివేశాడు: 'ఓయి హిరణ్యాక్షా!-- నా భక్తుడవు కావటం చేత నీవు చేస్తున్న ఆగడాలన్నిటికీ ఓర్చి ఊరుకున్నాను. కాని, రోజు రోజుకీ నీవూ నీ కుటుంబమూ చేసే ఘాతుక చర్యలు ఘోరంగా ఉంటున్నవి కనుక, మీరు జంతువులై పుట్టి అడవులంట తిరుగులాడుతూ ఉండండి,' అనేటప్పటికి, రాక్షసరాజు గడగడలాడుతూ పరమేశ్వరునికి సాష్టాంగపడి, పొరపాటు క్షమించి శాపం తప్పించమని ప్రార్థించాడు.

అప్పుడు శివుడు దయదలిచి, 'శాపం తప్పించడానికి వీలు కాదు. పన్నెండేళ్ల పాటు ఈ మృగజన్మలో ఉన్న తరవాత దైవచింత లేని ఒక బోయవాని చేతిలో మీకు మరణం సంభవించబోతుంది. ఆ సమయంలో మీకు పూర్వజన్మ స్మృతి

ముద్దా సోమప్పశాస్త్రి



కలిగేటట్టు, శాశ్వతమైన ముక్తి పొందే టట్టు అనుగ్రహిస్తున్నాను, పొండి!' అంటూ అదృశ్యమైనాడు. శివుని శాపం వల్ల హిరణ్యాక్షుడూ, అతని భార్యలూ జింకలుగా పుట్టి, అడవులలో సంచ రిస్తూ ఉంటున్నారు.

జింకలు సంచరించే ఆ అరణ్యానికి ప్రతిరోజూ ఒక ఈశ్వరభక్తుడు వచ్చి బిల్వపత్రాలు కోస్తూ ఉండేవాడు. ఒక్కొక్క పత్రం కోసినప్పుడల్లా శివశివా అని స్మరించి, కోసిన పత్రాలన్నీ ఆ చెట్టు కిందనే వెలసినటువంటి స్వాయంభువ లింగానికి పూజచేస్తూ ఉండేవాడు.

శాపవశం చేత మృగజన్మ ఎత్తిన జింకలు అతను చేసే పనిని గమనించి తమకు తరణోపాయం దొరికినట్లుగా పొంగిపోయినై.

నాటి నుంచి అవి స్వాయంభువ లింగం ఉండే స్థలం చక్కగా శ్రద్ధతో బాగు చేసి, మాలిన్యం తొలగించి, భక్తుడు మళ్లీ పూజకు వచ్చే సమయానికి సిద్ధం చేసిపెట్టేవి. ఈ విధంగా భక్తునితో పాటు, జింకలు కూడా నిత్యం ఈశ్వర సేవ చేస్తూ వచ్చాయి.

అదే అడవికి ఒక బోయవాడు కూడా వచ్చాడు. వాడు మామూలు బోయ వాడు కాదు. నిష్ఠాపరులైన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినవాడే కాని, కర్మవశం చేత కులభ్రష్టుడై కిరాతకు లలో కలిసిపోయాడు. ఒక కిరాత కన్యను వివాహం చేసుకుని వాళ్ల వృత్తినే అవలం బించాడు. దైవచింత, దయాదాక్షిణ్యమూ లేక, ఆ అడవిలో మృగాలను వేటా డుతూ ఉండేవాడు.

ఒకరోజున ఈశ్వరభక్తుడు బిల్వ పత్రాలు కోస్తూ ఉండగా బోయవాడు అడవికి రావడం తటస్థించింది. అతను 'శివశివా!' అన్నప్పుడల్లా మహాపాపాత్ము డైన ఆ బోయవాడు శివశివా! శివశివా! అంటూ ఎగతాళి చేస్తూ ఉండేవాడు. నోరు నొచ్చేవరకూ వాడు అతనిని వెక్కి రించి, తన మానాన తను వేటకు వెళ్లిపో యాడు. ఎప్పుడు మాటు వేసినా బోయ వాని వలలో ఏదో ఒక మృగం వెంటనే



వచ్చి పడేది. కాని ఈ వేళ చిన్న జంతు వైనా పడలేదు.

'ఏమైనా సరే జంతువు వలలో పడాలి ఇక్కడి నుంచి కదలాలి,' అనే పట్టుదలతో వాడు చీకటి పడినప్పటి నుంచి అరణ్యం వదిలిపోలేదు. పైగా, పంతం పట్టిన బోయడు ఆ కటిక చీకటిలో ఒక చెట్టు ఎక్కి కూర్చుని, ఆ ఈశ్వర భక్తుడు జ్ఞాపకం రాగా, 'శివశివా' అని మాటి మాటికీ వెక్కిరిస్తూ, ఆ చెట్టు ఆకులు తుంపనారంభించాడు.

ఇంతలో ఆ చెట్టుకిందకు ఒక ఆడు జింక వచ్చి నిలబడేసారికి, విల్లు ఎక్కు పెట్టి దానినతడు కొట్టబోయాడు. అప్పుడు ఆ జింక వానికి ఆశ్చర్యం కలిగేటట్టు మానవభాషలో, 'ఓయి బోయివాడా! కిందటి జన్మలో మాది రాక్షస కుటుంబం. శాపవశం చేత జింకలుగా పుట్టి అడవుల వెంట తిరుగుతున్నాము. ఇప్పుడు నేను నా భర్తను వెతుకబోతున్నాను. ఆయన అనుమతి పొంది తెల్లవారేలోపల తిరిగి వచ్చేస్తాను. కనుక నన్ను వదిలిపెట్టు,' అంటూ ప్రాధేయపడింది.

'నోరులేని జింక ఏమిటి ఇలా మాట్లాడటమేమిటి! కానీ దీని నీతి ఎంతవరకు నిలబడుతుందో చూదాం.' అని తలిచి బోయవాడు కాళ్లముందుకు వచ్చిన జింకను విడిచిపెట్టాడు. ఆడు జింక వెళ్లిన మరికొంచెం సేపటికే దాని భర్త ఐన మగజింక అక్కడికి రాగా, బోయవాడు దీనిపైకి బాణం ఎక్కుపెట్టబోయాడు. ఇది కూడా ఆడు జింక చెప్పినట్లే చెప్పి, ప్రమాణాలు చేసి ఇంటికి పోయింది. ఇంటివద్ద ఆడు జింక బిడ్డను కన్నది. అది బిడ్డనూ, భర్తనూ వెంట బెట్టుకు వచ్చి, 'ఓయీ బోయవాడా! ఇదుగో.., నేనే కాదు, మా కుటుంబమంతా-- నీకు ఆహారంగా వచ్చాము అరగించు, ఇప్పటికే ఆలస్యమైపోయింది....' అనేసరికి దాని న్యాయవర్తనం చూసి బోయడు చాలా ఆశ్చర్యపోయాడు.

ఈలోపల, పూర్వజ్ఞానం కలిగి ఆ జింకలు కడసారి స్వాయంభువ లింగాన్ని

శుభ్రపరిచి, దానికి భక్తిపూర్వకంగా ప్రదక్షిణం చేసి, బోయవానికి ఎరకావడానికి సిద్ధంగా నిలబడినై.

అప్పుడు బోయవాడు తను చేసిన పాపాలన్నీ తలపోసి దుఃఖించేటప్పటికి, కన్నీరు ధారలుగా ప్రవహించి, చెట్టు దిగువనున్న స్వాయంభువ లింగము పైన పడినయి.

కటికి చీకటిలో అతను ఎక్కి కూర్చున్నది బిల్వ వృక్షము. ఎగతాళికే కావచ్చు. తలవని తలంపుగా ఆ బిల్వపత్రాలు తుంపిపోయగా, అవి కింద ఉండే స్వాయంభువ లింగము మీద పడినందున ఈశ్వరుని పూజించినట్లయింది. అదృష్టవశాత్తు ఆ రోజు మహాపర్వదినమైన శివరాత్రి కనుక, రాత్రి జాగరముండి శివుని పూజించిన ఫలము బోయవానికి దక్కింది. పైగా, పశ్చాత్తాపము వల్ల అతని కన్నులనుండి ప్రవహించిన బాష్పధారలతో స్వాయంభువ లింగాన్ని అభిషేకించటం వల్ల శివుడు ప్రీతుడై, ఆ లింగము ఛేదించుకుని వచ్చి బోయవానికి సాక్షాత్కరించాడు. జింకల పుట్టు పూర్వోత్తరాలను పరమేశ్వరుడు బోయవానికి వెల్లడించాడు. ఆయన కరుణ వల్ల బోయవాని పాపములన్నీ పటాపంచలైపోయి, ముక్తి మార్గము లభించింది.

శివుని దీవనవల్ల జింకలు నక్షత్రమండలం చేరుకుని, చుక్కలుగా మారి జింక రూపంలో శాశ్వతంగా నిలచిపోయినై.

ఈ జింకరూపమే ఇరవైఏడు నక్షత్రాల లోనూ ఒకటైన మృగశిరగా ఇప్పటికీ పిలువబడుతున్నది. ఈవిధంగా రాక్షసరాజైన హిరణ్యాక్షుడూ, వాని కుటుంబమూ శివుని మహిమవల్ల శాప విముక్తి పొంది శాశ్వతమైన కీర్తిని సంపాదించగలిగారు.





# రంగయ్యే దొంగ

శిఖంగేరి దేశపు రాజు విజయసేనుడి రాజభవనంలో ఒకరోజు రాజుగారి వజ్రపు హారం దొంగలింపబడింది. భవనంలో పని చేస్తున్న రంగయ్య, గంగయ్య, భీమయ్య అనే సేవకులలో ఎవరో ఒకడు ఆ హారాన్ని దొంగిలించడానికి ఆస్కారముంది. కానీ ఎవరు వీరిలో దొంగ అన్నది తెలియలేదు.

రాజు ఆస్థాన జ్యోతిష్కుని పిలిపించి ఆ ముగ్గురిలో దొంగ ఎవరో నిర్ణయించమన్నాడు. జ్యోతిష్కునికి దొంగను ఎలా కనిపెట్టాలో తెలియలేదు. మరుసటి రోజు లోపల దొంగ ఎవరో చెప్పమని రాజు ఆదేశించాడు. చెప్పకపోతే ఉన్నఫళాన ఉద్యోగం ఊడిపోతుంది. జ్యోతిష్కుడు తికమక శాస్త్రి విచారంలో పడ్డాడు. తికమకశాస్త్రి కుమారుడు తిక్కశాస్త్రి చాలా తెలివైన కుర్రాడు. తండ్రి సమస్యను మరుసటి రోజు తెల్లవారులోగా తీరుస్తానని తండ్రిని ఓదార్చాడు.

ఆ రోజు రాత్రి తిక్కశాస్త్రి రంగయ్య ఇంటికెళ్లి రంగయ్యతో, 'రంగయ్యా, మా నాన్న వజ్రపుహారం దొంగ ఎక్కడ దాచాడో మంత్ర అద్దంలోంచి కనిపెట్టాడు. మన రాజధాని ఉద్యానవనంలో రాగి చెట్టుంది కదా. అక్కడే ఖచ్చితంగా దాచాడు. ఆ దొంగ మీరెవరూ కాదని తేల్చాడు. ఈ రాత్రి నీవు అక్కడికి రా, నేను అక్కడే ఉంటాను. హారాన్ని వెలుపలకు తీసి తీసుకెళ్లి అమ్మి ఆ డబ్బును మనమిద్దరమూ పంచుకుందాం. ఈ విషయం మా నాన్నకు తెలియకుండా ఉంటుంది. నాకు గుర్రాల పందెం ఆడే అలవాటుంది కదా! దానికి

కోలార్ కృష్ణ అయ్యర్

డబ్బు కావాలి. ఏమంటావు?' అని అడిగాడు. రంగయ్య కొంత ఆలోచించి, 'సరే అలాగే,' అన్నాడు.

తరువాత తిక్క శాస్త్రి రంగయ్య భీమయ్య ఇండ్లకు వెళ్లి అలాగే చెప్పాడు. వాళ్లిద్దరూ సరే అన్నారు.

తిక్కశాస్త్రి ఉద్యానవనానికి వెళ్లి, ఆ ముగ్గురి కోసం కాచుకుని కూర్చున్నాడు. కొంత సేపటికి గంగయ్య, భీమయ్య వచ్చారు. కానీ ఎంతసేపటికీ రంగయ్య రాలేదు. రావి చెట్టు కింద తవ్వి చూశారు. కాని వాళ్లకు ఏమీ కనబడలేదు. గంగయ్య, భీమయ్య నిరుత్సాహంతో ఇండ్లకు వెళ్లిపోయారు.

తిక్క శాస్త్రి ఇంటికి వచ్చి తండ్రి తికమక శాస్త్రికి చెప్పాడు.

'నాన్నా ఆ దొంగ రంగయ్యే,' అన్నాడు.

'ఎలా చెప్పగలవు?' అని అడిగాడు తండ్రి.

తాను పన్నినపన్నాగం అంతా వివరంగా చెప్పి, 'నాన్నా ఆ ముగ్గురిలో రంగయ్య దొంగ కనుక ఆ వజ్రాన్ని ఎక్కడ దాచిందీ వాడికి తెలుసు. ఆ రాగి చెట్టు కింద లేదని తెలుసు. అందుకేవాడు రాలేదు. గంగయ్య, భీమయ్య అమాయకులు కనుక తిక్క శాస్త్రి మాటలు నమ్మి దురాశతో వచ్చారు.' అని వివరంగా చెప్పాడు.

మరుసటి రోజు రాజుగారితో తన కుమారుడు తిక్కశాస్త్రి ఎలా దొంగను కనిపెట్టిందీ తికమకశాస్త్రి వివరంగా చెప్పాడు.

రంగయ్యను రాజభటులు నాలుగు దెబ్బలు తగిలించేసరికి, తానే దొంగిలించానని అంగీకరించి, దాచిన వజ్రాల దండను తెచ్చి ఇచ్చాడు. రంగయ్యకు కారాగార శిక్ష పడింది.

రాజు తిక్కశాస్త్రి తెలివికి మెచ్చుకుని అతడిని ఆస్థాన అపరాధ పరిశోధనాధికారిగా నియమించి సత్కరించాడు.





# మోహం చాటేసిన మంత్రి

మగధ రాజ్యాన్ని రామగుప్తుడు పరిపాలించే సమయంలో అతడి రాజ్యం మీద ఇరుగు పొరుగు రాజ్యాలవాళ్లు కన్నువేశారు. రామగుప్తుడి కాలానికి మగధ తన పూర్వపు వైభవం కోల్పోయింది.

అందువల్ల శత్రురాజులు ఎక్కడికక్కడ సరిహద్దుల్లో కాపు వేసి, రాజ్యంలోకి గూఢచారులను పంపించి తగిన అవకాశం కోసం ఎదురు చూడసాగారు.

'రామగుప్తుడు తన సరిహద్దు భద్రత గురించి ఆందోళన పడుతూ, తన మంత్రిని సలహా అడిగాడు. ఆయనకి తన సలహా నచ్చితే గొప్ప కానుకలతో తనను ముంచెత్తుతాడని మంత్రికి ఇంతకు ముందే అనుభవమయింది. పైగా రాజు వద్ద తన మాటకు విలువ మరింత పెరుగుతుంది.

'ఈ రాత్రంతా ఆలోచించి తమకు ఒక ఉత్తమమైన సలహాను రేపటికి మనవి చేసుకుంటాను.' అని మంత్రి సెలవు తీసుకున్నాడు. మంత్రి ఊహించని విధంగా ఆయన ఇంటికి తన అక్క కొడుకైన శివనాథుడు వచ్చి ఉన్నాడు.

మంత్రి అతడి రాక గురించి కారణం అడిగాడు.

శివనాథుడు అనేక రకాల శాస్త్రాలు చదువుకున్న యువకుడు. వినయవంతుడు. ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాడు. రాజుగారి కొలువులో సలహాదారు ఉద్యోగం ఆశించి వచ్చాడు. తన మేనమామ తనకి మాట సహాయం చేస్తాడని ఆశపడ్డాడు శివనాథుడు.

ప్రభుత్వం సలహాదారు ఉద్యోగం ఒక మంత్రితో సమానమైనది. తన కళ్లముందు పుట్టి పెరిగిన బుడతడు తనతో సమానమైన ఉద్యోగానికి ఆశపడుతుండటంతో శివనాథుడి మీద మంత్రికి అంతులేని అసూయా ద్వేషాలు పుట్టుకొచ్చాయి.

ఎమ్. సత్యవతీదేవి



ఆ రాత్రి మంత్రితో ఆయన భార్య, 'శివనాథుడి అర్హతలు రాజుగారి కొలువులో ఉద్యోగానికి సరిపోతాయి. అతడికి ఉద్యోగం వేయించుకుని మన అమ్మాయినిచ్చి పెళ్లి చేద్దాం. అతడికంటే యోగ్యుడు మన కుటుంబాల్లో దొరకడు,' అంది.

మంత్రి ఆమె మాటలను ఒక చెవిలో విని రెండో చెవితో విడిచి పెట్టాడు.

శివనాథుడంతటి తెలివి కల యువకుడిని రాజుగారికి పరిచయం చేయడం మంత్రికి ఇష్టంలేదు. అతడు అంచెలంచెలుగా ఎదిగిపోతే తన వంటి వాడి పరిస్థితి ఏమిటి?

అయినప్పటికీ పైకి నవ్వుతూ, 'రాజసేవ అంటే మాటల్లో అయ్యే పని కాదు. రాజుగారి మనస్సు గుర్తించి ఎప్పటికప్పుడు ఆయన మనస్సుకు అనుగుణంగా మసలుకోవడమంటే సామాన్యమైన విషయం కాదు. రాజు కొలువుతో పాటు ఇంకా ఇతర్రతా ఉద్యోగాలు దొరుకుతాయేమో ప్రయత్నించవలసి ఉంటుంది,' అన్నాడు మంత్రి.

శివనాథుడికి ఆయన మనస్సు స్పష్టంగా అర్థమైపోయింది. అయినప్పటికీ తనది ఇంకా చిన్న వయస్సే. ఆయన చెప్పినట్టు ఇతర ప్రయత్నాలు చేసుకోవడం కూడా మంచిదే.

మంత్రి ఇచ్చిన సలహాకు కృతజ్ఞతలు చెప్పుకుని, 'అలాగే చేద్దామండి, నేను చదువుకున్నదే రాజకీయ శాస్త్రం. అందువల్ల రాజుకొలువని ఆశపడి వచ్చాను,' అన్నాడు శివనాథుడు.

ఇదే తగిన సమయంగా తీసుకుని, మహారాజు తనను సరిహద్దుల రక్షణ గురించి అడిగిన సమస్యను అతడికి వివరించాడు మంత్రి. పరిష్కార మార్గం సూచించమని శివనాథుడిని అడిగాడు.

ఆ సమస్యను అతి తేలికపాటి సమస్యగా భావించాడు శివనాథుడు. అట్టే తడుముకోకుండా, 'రాజ్యాన్ని రక్షించుకోవడంలో ప్రభువుకెంత బాధ్యత ఉందో ఆ రాజ్య ప్రజలకూ అంతే బాధ్యత ఉంటుంది. సరిహద్దు గ్రామాల ప్రజలనుండి పన్నులు వసూలు చేయకండి. ఆ సొమ్మును గ్రామంలోని యువకులకు సైనిక శిక్షణ ఇవ్వడానికి ఖర్చుచేయవలసిందిగా గ్రామస్తులను ఆదేశించండి. సైనిక శిక్షణ పొందినవారికి ఆయుధాలు అందించండి. వంతుల వారీగా సరిహద్దులను కాపలా కాయమనండి. ప్రతి గ్రామంలోనూ ఒక బురుజును నిర్మింపచెయ్యండి. ప్రజలు భాగస్వామ్యం వహిస్తే బాధ్యత పెరుగుతుంది.' అంటూ సలహా

ఇచ్చాడు. ఇదంతా తనకు తోచిన సలహాగానే మంత్రి ఆ మరునాడు రామగుప్తుడికి వివరించి చెప్పాడు. రామగుప్తుడికి మంత్రి మాటలు గొప్పగా నచ్చాయి. మంత్రిని విలువైన కానుకలతో ముంచెత్తాడు.

ప్రభుత్వం మీద ఎక్కువ భారం పడకుండానే సమస్య పరిష్కరించబడినందుకు రాజ్యంలో సంతోషం తాండవించింది.

సరిహద్దు గ్రామాల్లో రక్షణ చర్యలు బలపడ్డాయి. యువకులకు ఉద్యోగాలు దొరికాయి.

నెలరోజుల తర్వాత తనను కలియవలసిందిగా చెప్పి శివనాథుడిని అతడి ఇంటికి పంపించేశాడు మంత్రి.

అయితే రాజుగారి సంతోషం పట్టుమని ఒక్క వారం రోజుల పాటు కూడా మిగల్లేదు.

ఎందుకంటే రాజుగారి అంతరంగిక మందిరంలో పొరుగు రాజ్యపు గూఢచారి ఒకడు పట్టుబడ్డాడు. ఆ గూఢచారి వద్ద కోటలోకి ప్రవేశించే రహస్య మార్గాల చిత్రపటాలు అనేకం దొరికాయి.

గూఢచారిని బంధించిన తర్వాత, 'ఇటువంటి ప్రమాదకరమైన వ్యక్తులు ఇంకా ఎంతమంది మన రాజ్యంలో సంచరిస్తున్నారో కనిపెట్టడం ఎలా,' అని మంత్రిని సలహా అడిగాడు రామగుప్తుడు.

మంత్రికి పచ్చివెలక్కాయ గొంతులో పడింది. ఆ రాత్రికి రాత్రే శివనాథుడి ఇంటికి చేరుకున్నాడు మంత్రి.

శివనాథుడిని కావిలించుకుని నవ్వి, ఎక్కడ లేని ప్రేమాభిమానాలు కురిపిస్తూ, 'మన రాజ్యంలో గూఢచారులు సంచరిస్తున్నారు. వాళ్లను పట్టుకుని ఉరికంబం ఎక్కించాలంటే మార్గం ఏమిటి?' అని అడిగాడు.

శివనాథుడు ఈ సమస్యను కూడా తేలికగా తీసుకుని, 'ఇటీవలి కాలంలో ఇతర



రాజ్యాల నుండి మన రాజ్యానికి వలస వచ్చిన కుటుంబాల జాబితా తమ వద్ద ఉండే ఉంటుంది. ఆ కుటుంబాలే గూఢచారులకు ఆశ్రయమిస్తాయి. అసలు అలాంటి ఆశ్రయం ఇచ్చే ఉద్దేశంతోనే మనరాజ్యంలో ప్రవేశించాయి కూడా. వాళ్లను ప్రశ్నిస్తే మీక్కావలసిన వ్యక్తులు తప్పకుండా దొరుకుతారు,' అన్నాడు.

శివనాథుడి బుద్ధి కుశలతకు మంత్రి నివ్వెరపోయాడు. మర్నాటి ఉదయానికి అంతఃపురం చేరుకున్నాడు మంత్రి. క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా రాజుగారికి పరిష్కార మార్గం వివరించాడు.

అయితే మునుపటిలాగే అదంతా తనకు పుట్టిన ఆలోచన మాదిరిగానే వర్ణించాడు శివవనాథుడు. రాజు పరమానందభరితుడయ్యాడు.

వలస వచ్చిన కుటుంబాలవారిని సమావేశపరిచి వాళ్ల కళ్ళెదుటే అంతకు ముందు పట్టుబడిన గూఢచారిని ఉరితియ్యించాడు.

వలస వచ్చిన కుటుంబాల వాళ్ళు ఈ ఘటనతో వణికిపోయారు. వరుసగా తమకి తెలిసిన గూఢచారులందరినీ రాజుగారికి ఒప్పచెప్పారు. వాళ్లందరినీ శిక్షించాడు రామగుప్తుడు.

తరవాత సరిహద్దు రక్షణ సమస్య కూడా తగ్గిపోయింది.

మంత్రిని తన ఎదుటికి రప్పించుకుని, 'వాళ్లతో బాటు నిన్ను కూడా కఠినంగా శిక్షించవలసిందే. నీకు చక్కటి సలహాలు అందించిన శివనాథుడిని నావద్దకు రాకుండా దాచిపెట్టి ఉంచావు. అతడి సలహాలు నీ సలహాలుగా ప్రకటించి నా మెప్పు సంపాదించావు. అంతే తప్ప అతడికి తగిన ఉద్యోగం కల్పించాలని ప్రయత్నించలేదు. రాజ్యానికి అపకారం చేసే వారిని ఎలా వదిలించుకోవాలో, అదెంత ముఖ్యమో, రాజ్యానికి పనికివచ్చే వారిని రానివ్వడం కూడా అంతే ముఖ్యం,' అన్నాడు.

శివనాథుడికి కబురు పంపాడు రామగుప్తుడు. తన కొలువులో ముఖ్య సలహాదారుగా అతడికి ఉద్యోగం ఇచ్చాడు. మంత్రి తన మేనల్లుడికి తన మొహం చూపించలేకపోయాడు.



# పిసినిగొట్టు

రామాపురంలో రంగయ్య శెట్టి అనే వ్యాపారి ఉండేవాడు. అతడు ఆ గ్రామంలో గొప్ప పిసినిగొట్టుగా పేరు పొందాడు. రోజూ రెండు పూటలా భోజనం చేస్తే డబ్బు ఖర్చవుతుందని, ఒక్కపూట మాత్రమే భోజనం చేసేవాడు. రంగయ్య శెట్టికి ముగ్గురు కొడుకులు. భార్య చనిపోవడంవలన, పిల్లలను తనే పెంచి పెద్ద చేశాడు.

కొన్నాళ్లు గడిచాయి. రంగయ్య శెట్టి అనారోగ్యంతో మంచం పట్టాడు. మరణం దగ్గరవుతున్న కొద్దీ ఇనప్పెట్టె తాళం చెవులు ముగ్గురు కొడుకులలో ఎవరికి ఇవ్వాలా అని దిగులు చెందసాగాడు. ఒకనాడు ముగ్గురు కొడుకులను దగ్గిరకు పిలిచి చెప్పాడు.

'నాయనలారా! నాకు అవసానకాలం దగ్గరపడింది. వ్యాపారం చేయడం కత్తిమీద సాము లాంటిది. నలుగురితో మంచిగా ఉంటూనే వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవాలి. కాబట్టే అవాం తరాలు ఎదురయినా ధైర్యంతో తెలివిగా వ్యాపారం చేయగలవాడికి, మన ఇంటి తాళాలు ఇవ్వాలనుకుంటున్నాను. మీ అభిప్రాయం ఏమిటి?' అని ప్రశ్నించాడు హీనస్వరంతో.

దానికి సమాధానంగా పెద్దకొడుకు, 'దాన్ని గురించి ఇప్పుడే ఆలోచించడం ఎందుకు తర్వాత చూద్దాంలే నాన్నా!' అన్నాడు. రెండోవాడు మాత్రం 'ఆస్తిని ఒక్కరికే అప్పగించడం ఎందుకు? ముగ్గురం సమానంగా పంచుకుంటే సరిపోతుంది,' అని తన అభిప్రాయం చెప్పాడు.

మూడవ కుమారుడు మౌనంగా ఉండటం చూసిన రంగయ్యశెట్టి, 'నువ్వేమంటావు చిన్నా?' అనడిగాడు. 'మరేం లేదు నాన్నా! నీవు జబ్బున పడ్డావు. కీడెంచి మేలెంచమన్నారు గదా పెద్దలు. నువ్వు హఠాత్తుగా చనిపోతే కట్టెలు, కర్మకాండలకు అవసరమయిన సామగ్రి ఎక్కడి నుండి తెస్తే లాభసాటిగా ఉంటుందా అని ఆలోచిస్తున్నాను,' అన్నాడు చిన్న కొడుకు.

రంగయ్య శెట్టి ముఖంలో కాంతి పొడసూపింది. 'అమ్మయ్య! ఇప్పటికి నా మనస్సు శాంతించింది,' అంటూ తాళం చేతులు మూడవ కుమారుడి చేతిలో పెట్టి తృప్తిగా కన్ను మూశాడు రంగయ్యశెట్టి.

– ఎ.ఎల్. సువర్చల






మర్నాడు జాలర్లు వచ్చి, వలలు వేసి, మడుగులోని చేపలనన్నిటినీ పట్టేశారు. ప్రత్యుత్పన్నమతి యుక్తిగా చచ్చినట్టు పడి ఉన్నది. దాన్ని చూసిన జాలర్లు, 'ఈ చేప చచ్చింది. దీన్ని ఒడ్డున ఉంచి, మిగిలిన చేపలన్నీ చచ్చినాక వాటితోపాటు పట్టుకు పోదాం,' అనుకున్నారు. వాళ్లు తనను ఒడ్డు మీద ఉంచిన మీదట ప్రత్యుత్పన్నమతి చల్లగా తిరిగి నీటిలోకి జారుకున్నది. యద్భవిష్యతి మాత్రం వలలో తన్నుకుంటూ ఉండగా జాలర్లు దాన్ని చంపేసి, మిగతా చిన్న చేపలతో పాటు పట్టుకుపోయారు.

తన భార్య చెప్పిన చేపల కథ విని మగ ఉల్లంకి పిట్ట, 'నేను యద్భవిష్యతిలాటి వాణ్ణి అనుకున్నావా? నేను ముందు ఆలోచించి, నా యుక్తులన్నీ వేసుకుని మరీ ఏ పనైనా చేస్తాను. నేనుండగా నీకు వచ్చిన భయం ఏమీ లేదు,' అన్నది.

దాని మాట నమ్మి ఆడపిట్ట సముద్రం ఒడ్డున గుడ్లు పెట్టింది.

ఆడ ఉల్లంకి పిట్ట సముద్రతీరాన గుడ్లు పెట్టక పూర్వం పక్షి దంపతుల మధ్య నడిచిన సంభాషణం అంతా సముద్రం విన్నది. విని 'ఈ మగపిట్టకు ఇంత పొగరా? దీనికి గట్టిగా బుద్ధి చెప్పాలి,' అనుకున్నది.

మర్నాడు ఉల్లంకి దంపతులు రెండూ ఆహారం కోసం వెళ్లినప్పుడు, సముద్రం పెద్ద కెరటాన్ని పంపి, గుడ్లను లాగేసుకున్నది. పిట్టలు తిరిగి వచ్చేసరికి గుడ్లు లేవు.

ఆడ పిట్ట మగపిట్టతో, 'మన గుడ్లు ఏమయ్యాయో చూడు. నువు యద్భవిష్యతిలాగే కోరి కీడు తెచ్చావు. పిల్లలను

మిత్రభేదం - 19

పోగొట్టుకుని జీవించలేను, మంటలలో పడి ఆత్మహత్య చేసుకుంటాను,' అన్నది.

'నువు తొందరపడి అఘాయిత్యం చెయ్యకు. ఈ సముద్రాన్ని ఎండగట్టి, నా తడాఖా చూపుతాను' అన్నది మగ ఉల్లంకి పిట్ట.

'రెక్కల పురుగు జ్వాలతో పోరాడినట్టే ఉంటుంది నువు సముద్రంతో పోరాడటం,' అన్నది ఆడపిట్ట.

'అలా అనకు. నా ముక్కుతో సముద్రం లోని నీరంతా లాగేసి ఇసుక పర్ర మిగిలేటట్టు చేస్తాను,' అన్నది మగపిట్ట.

'నీ ముక్కులో ఒక్క నీటి చుక్క కన్న పట్టదు గదా! గంగా సింధుల లాటి ఆరు వేల నదులూ, డెబ్బై అయిదువేల ఉప నదులూ వచ్చి అనుక్షణమూ కలిసే సముద్రాన్ని ఎలా ఎండగట్టుతావు?' అన్నది ఆడపిట్ట.

'ఎందుకీ నిరుత్సాహపు మాటలు? దీక్షతోనూ, మనోనిబ్బరంతోనూ పూనికచేస్తే సాధించలేనిదంటూ ఉంటుందా?' అని మగ పిట్ట అడిగింది.

'కనీసం మిగిలిన పక్షులన్నిటి సహకారమూ సంపాదించు. ఒక్కరి వల్ల కాని పని పదిమంది వల్ల అవుతుంది. ఒక్క తాడు ఎన్నడూ ఏనుగును' బంధించలేదు. కాని నూరుపేటల తాళ్లతో పేనిన మోకు ఏనుగును సులభంగా నిగ్రహిస్తుంది. వడ్రంగి పిట్టా, పిచ్చుకా, కప్పా, మేకా, ఏకమై



ఏనుగును మట్టుబెట్టాయి కావా?' అన్నది ఆడపిట్ట.

'ఏమిటా కథ? అని మగపిట్ట అడిగింది. ఆడపిట్ట ఇలా చెప్పింది.

పిచ్చుకా – ఏనుగూ

ఒక ఆరణ్యంలో ఒక పెద్ద చెట్టుకొమ్మ మీద గూడు కట్టుకుని ఒక పిచ్చుకల జంట నివసిస్తూ ఉండేది. ఆడపిచ్చుక అప్పుడే గుడ్లు పెట్టింది. ఆ మర్నాడు ఒక ఏనుగు అటుగా పోతూ, మధ్యాహ్నపు టెండకు తట్టుకోలేక, ఆ చెట్టు నీడన నిలిచి, ఆకతాయితనం కొద్దీ చెట్టు కొమ్మ విరిచింది. ఆ కొమ్మ మీదనే పిచ్చుకల గూడు ఉన్నది. ఆ గూట్లో ఉన్న గుడ్లన్నీ కిందపడి పగిలిపోయాయి. అదృష్టవశాన పిచ్చుకల జంటకు

చావు తప్పింది. గుడ్లు నాశనమయినందుకు ఆడ పిచ్చుక మహా శోకించింది.

దాని శోకాలు విని, పొరుగున ఉంటున్న దాని స్నేహితురాలు వడ్రంగిపిట్ట వచ్చి, శోకకారణం తెలుసుకుని, 'పిచ్చిదానా, ఏడ్చి లాభమేమిటి? గతించిన దానికి బుద్ధిమంతులు శోకించరు. చచ్చిపోయిన వాళ్ల కోసం ఏడవటం రెట్టింపు బాధ. చేతనైన మటుకు వారి చావుకు ప్రతీకారం చెయ్యాలి,' అన్నది.

దానికి ఆడపిచ్చుక 'అదంతా నిజమే. కాని ఈ దుర్మార్గపు ఏనుగు కేవలమూ పొగరుబోతుతనంతో నా బిడ్డల ప్రాణాలు తీసింది. నీవు నిజమైన స్నేహితురాలివైతే, ఈ రాకాసి ఏనుగును చంపే ఉపాయం ఆలోచించు,' అన్నది.

'మనకు ఆపత్సమయంలో ఆదుకున్న వాడే మిత్రుడు. కలిగిన వేళ అందరూ మిత్రులే. కలిసి రాని కాలంలో అండగా నిలిచిన వాడే హితుడు. తిండి పెట్టినవాడే తండ్రి: నమ్మినవాడే మిత్రుడు; సుఖ పెట్టినదే భార్య. నా స్నేహం ఎలాటిదో త్వరలో చూపుతాను. వీణారవం అనే నా తుమ్మెద స్నేహితురాలిని తెస్తాను. ఏనుగును చంపే మార్గం అది చెబుతుంది,' అన్నది వడ్రంగి పిట్ట.

ఆడపిచ్చుకను వెంటబెట్టుకుని వడ్రంగి పిట్ట తుమ్మెద వద్దకు వెళ్ళి, జరిగిన అన్యాయం చెప్పి, 'ఏనుగును చంపే ఉపాయం నువ్వు చెప్పాలి,. అన్నది.

'అయ్యో పాపం! ఈమెకు ఇంత కష్టం కలిగిందా? మేఘదూత అనే కప్ప నాకు మంచి స్నేహితుడు. అతనితో కూడా సంప్రదించుదాం. శ్రేయోభిలాషులనూ, సజ్జనులనూ, రాజనీతి తెలిసిన వాళ్లనూ, విజ్ఞానులనూ సంప్రదించి చేసే పనులు ఫలిస్తాయంటారు,' అన్నది తుమ్మెద.

(ఇంకా ఉంది)





# మానవ వనరులు

అమరాపురం రాజ్యం మీదికి గోవిందా పురం రాజు దండెత్తాడు. యుద్ధంలో గోవిం దాపురం సైన్యాలు ఓడిపోయి పారిపో యాయి. అమరాపురం రాజుకి వందమంది సైనికులు యుద్ధఖైదీలుగా చిక్కారు.

అమరాపురం రాజు విజయోత్సవాలు జరిపించాడు. అందులో తమకు దొరికిన గోవిందాపురం సైనికులను ప్రదర్శించాడు. వారందరినీ త్వరలో కొరతవేసి చంపుతారని జనం చెప్పుకుంటున్నారు.

పట్టణంలో ప్రముఖ వ్యాపారి నారా యణశెట్టి భార్య విద్యావతి, దీనవదనాలతో తలలు వంచుకుని అవమానభారంతో నిల్చున్న యుద్ధఖైదీలను చూసి జాలి పడింది. వారంతా గోవిందాపురం కాల్బ లానికి చెందిన సైనికులు. వారికి మొలకి గోచీ వంటిది తప్ప వంటిమీద దుస్తులు లేవు. చేతికి ఒక కత్తి, డాలు ఇచ్చి యుద్ధా నికి పంపుతారు.

'నాథా! యుద్ధ ఖైదీలుగా దొరికిన వారిని చంపడం అమానుషం కాదా?' అని భర్తని ప్రశ్నించింది.

'నిజమే. అది వారి దురదృష్టం. మన మేమి చేయగలం?' అన్నాడు నారాయణ శెట్టి.

'మంత్రి తిమ్మరాజు మీకు మంచి స్నేహితుడే గదా! ఏదైనా మంత్రాంగం చేసి వారిని విడిపించే ప్రయత్నం చేయండి. యుద్ధాల పేరుతో యువకులందరూ చనిపోతున్నారు. వ్యవసాయానికి కూడా మనుషులు దొరకడం లేదు,' అన్నది విద్యావతి.

వాణిశ్రీ

భార్య చెప్పిన విషయం నారాయణ శెట్టిని ఆలోచింపజేసింది. నిజమే కదా! వందమంది బలిష్టులైన యువకులను దారుణంగా వధించడం వలన ఎవరికీ ఉపయోగం? వారు తమకు శత్రువులైనా, వారి గోవిందాపురానికి దేశభక్తులే గదా! అందులో వారి తప్పేమి ఉన్నది?

నారాయణ శెట్టి మంత్రి తిమ్మరాజుతో కలిసి యుద్ధ ఖైదీల గురించి చర్చించాడు.

'మిత్రమా! నీకంత ఉదారగుణం ఉంటే వారిని వెల ఇచ్చి కొనుక్కో! నీకున్న వ్యవసాయ క్షేత్రాలలో, ఇనుపగనులలో పనులు చేయించుకో. నీకు ఇష్టమైతే రాజుతో మాట్లాడి ఒప్పిస్తాను,' అన్నాడు తిమ్మరాజు.

'మనుషుల ప్రాణాలు కాపాడటానికి నా ధనం ఉపయోగపడితే అంతకంటే నాకు కావల్సింది ఏముంది?' అని నారాయణ శెట్టి యుద్ధఖైదీలకు వెల చెల్లించడానికి సిద్ధపడ్డాడు. అమరాపురం రాజు కూడా అందుకు ఒప్పుకుని ఖైదీలను విడుదల చేసి నారాయణ శెట్టిని అభినందించాడు. తమ ప్రాణాలు కాపాడిన నారాయణ శెట్టికి యుద్ధ ఖైదీలు కృతజ్ఞతలు తెలిపి సంతోషంగా అతడి వ్యవసాయ క్షేత్రాలలో, ఇనుపగనులలో పనులు చేస్తూ జీవితం కొనసాగించారు.

'నాథా! రాజులు అవివేకంతోనో, అహంకారంతోనో మానవ వనరులను వృథా చేస్తుంటారు. పౌరులుగా మనం విజ్ఞత ప్రదర్శించి కాపాడుకోవాలి. ధనంకంటే మానవత్వం గొప్పదని మీరు నిరూపించారు' అని నారాయణ శెట్టిని పొగిడింది విద్యావతి.

'ఇందులో నా గొప్పతనం ఏమీ లేదు. నీలోని జాలిగుణమే వారిని కాపాడింది,' అని భార్యని ప్రశంసించాడు నారాయణ శెట్టి.






# కుక్క ముక్కు చల్లగా ఉంటుంది ఎందుకో తెలుసా?

చాలాకాలం క్రిందట ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. అతను పరమలోభి కఠినాత్ముడు. అతని పిల్లలు ఒక కుక్కను తెచ్చి మక్కువతో పెంచుతూ వచ్చారు. ఈ పని రైతుకు ఎంత మాత్రం ఇష్టం లేక పోయింది. కాని జాలిగుండె గల అతని భార్య మటుకు విశ్వాసం గల ఆ కుక్కను ప్రాణప్రదంగా చూచుకునేది.

ఒకప్పుడు ఆ ఊరిలో భయంకరమైన అంటువ్యాధి ప్రవేశించింది. అది త్వరలోనే గ్రామమంతా వ్యాపించి, అనేకమంది చని పోసాగారు. గ్రామస్థులు ఈ పరిస్థితి చూచి మరొక ఊరు చేరుకుని ప్రాణాలు నిలబె ట్టుకోవడమే గత్యంతరమని నిశ్చయిం చారు.

ఆ ఊరినించి కదలిపోవాలంటే రెండు మూడు రోజులు పడవ ప్రయాణం చేయాలి. గ్రామస్థులతో పాటు పడవలో రైతు కుటుంబం కూడా బయలుదేరారు. అతని పిల్లలూ, భార్యా తమకు ప్రాణ సమానమైన కుక్కను కూడా పడవ ఎక్కిం చబోయారు.

'జనానికే చోటు చాలక ఇబ్బంది పడుతూ ఉంటే కుక్క కూడా ఎందుకు?' అంటూ రైతు విసుక్కున్నాడు. కాని అతని భార్య 'ఐతే దానినే కాదు నన్నూ వదలె య్యండి,' అని విరక్తిగా అనేసరికి, 'తప్ప దురా భగవంతుడా' అనుకుని సమ్మతిం చాడు రైతు.

రాత్రికాగానే, ప్రయాణీకులందరూ సర్దుకొని పడుకున్నారు. కుక్కమాత్రం సహజసిద్ధమైన విశ్వాసగుణంతో, పడవను నలుమూలలా పరీక్షిస్తూ, కాపలా కాస్తూనే ఉంది.

అది అలా కాపలా కాస్తుండగా ఒకచోట పడవలోకి నీళ్లు వస్తున్నట్లు కనిపించింది. ఈ నీళ్లు ఎందుకు వస్తున్నాయెూ అని కుక్కకు కంగారు పుట్టి, పడవంతా కలియ తిరిగి చూడగా ఒక చోట ఒక చిన్న రంధ్రంలో నుంచి పడవలోకి నీళ్లు రావడం కనిపించింది.

జనమంతా పాపం నిశ్చింతగా నిద్రి స్తున్నారు. ఈ రంధ్రంలోనించి నీరు వస్తున్న సంగతి ఒక్కరికీ తెలియకపోయే. ఇలానే ఊరుకున్నట్లయితే, మరొక గంటసేపటిలో నీరు జోరుగా ప్రవహించి పడవ గంగార్ప ణమై పోవడానికి సందేహం లేదు. ఏమి చేసేది? ఇన్ని ప్రాణాలు ఎలా నిలు స్తాయి? అంటూ కుక్క అనేక విధాలుగా మథనపడగా దానికి మెరుపులా ఒక చక్కని ఆలోచన తట్టింది. తక్షణమే అది తన గతి ఏమవుతుందో అనే తలంపే లేకుండా, దాని ముక్కును ఆ చిన్న రంధ్రంలో పెట్టి, లోనికి నీరు రాకుండా అడ్డుకున్నది. అది ముక్కు అవతలకు తీసిందంటే బిలబిలమంటూ నీరు వచ్చి పడి పడవకు ప్రమాదం కలుగు తుందన్నమాట. ఆ సంగతి ఎరిగిన ఆ కుక్క ప్రయాణీకులను కాపాడటం కోసం ముక్కు రంధ్రంలోనే ఉంచి, రాత్రల్లా నిలబడే ఉంది.

తెల్లవారగానే పడవపెద్ద వచ్చి కుక్క కదలకపోవడానికి గల కారణం గ్రహించి దాని తెలివితేటలకూ విశ్వాసానికి ఆశ్చర్య పోయాడు. పడవలోని వారందరూ తమను రక్షించిన ఆ కుక్కను ఎంతో మెచ్చుకు న్నారు. దాని యజమాని అయిన రైతు కూడా తన ఉపేక్షకు సిగ్గుపడి పశ్చాత్తాపం చెందాడు.

మరి కొద్ది రోజులకే ఆ గ్రామంలో పరిస్థి తులు చక్కబడగా, రైతు కుటుంబం తిరిగి వచ్చింది. అప్పటినుంచీ ఆ రైతు తక్కిన కుటుంబంతో పాటు కుక్కను కూడా ఎంతో ప్రేమతో చూసుకోసాగాడు.

ఒక రాత్రల్లా నీటిలో తడిసి ఉండటం చేత, ఆ నాటి నుంచీ కుక్క ముక్కు చల్లగా ఉంటున్నదని చెప్పుకుంటారు.





# ఎంతకూ నిండని గోతము

అనగనగా ఒక రాజు. ఆ రాజుదగ్గర ఒక మంగలి ఉండేవాడు. వాడు ఒక రోజున అడవి మార్గము ద్వారా పొరుగూరికి పోవలసి వచ్చింది.

అలా ఒక పెద్ద చెట్టు కింది నుంచి పోతూ ఉండగా, 'అబ్బాయీ! నా వద్ద వరహాలతో నిండిన ఏడు గోతాలున్నవి. అవి నీకు కావాలా?' అంటూ ఒక చిత్ర మైన ధ్వని వినిపించింది.

మంగలి అటు ఇటు చూశాడు. కాని ఆ చుట్టుపక్కల ఎవ్వరూ కనబడలేదు. 'ఈ చెట్టుమీద ఏదో దెయ్యం ఉండి ఉంటుంది. నన్ను మోసం చెయ్యటా నికి అదే ఇలా అరిచి ఉంటుంది. కనుక ఇక్కడ క్షణం కూడా నిలవకూడదు' అనుకుని అతను తిరిగి తనదారిన తాను పోసాగాడు. కాని మంగలి ఇంకా వంద గజాల దూరమైనా పోకముందే మళ్లీ ఆ చెట్టుపైపునించి, 'నిన్నేనయ్యా అలా పారి పోతావేమిటి? నేను చెప్పింది అబద్ధం కాదు. నీకు కావాలంటే ఆ ఏడు గోతాలు ఇస్తాను రా,' అని వినిపించింది.

ఈసారి మాత్రం మంగలికి కొంచెం ఆశ కలిగింది.

సరే ఇంతలో ఏం పోయింది, అని తలిచి, చెట్టుదగ్గరికి తిరిగివచ్చి, 'నాకు కావాలి,' అని గట్టిగా అరిచాడు.

అందుకు బదులుగా 'సరే, ఏడు గోతాలూ మీ ఇంటికి చేరాయి. పోయి చూసుకో' అని ఆ అశరీరవాణి మళ్లీ జవాబు చెప్పింది. ఈ జవాబు వినేవరకు మంగలికి ఆశతో పాటు ఆశ్చర్యం కూడా

హెచ్.వి.గోపాలకృష్ణమూర్తి



కలిగింది. 'ఐనా, ఈ మాటలు ఎంత వరకు నిజమో చూదాం,' అని ఆలోచించి, వాడు ఆత్రంతో ఒక్క పరుగున ఇల్లు చేరుకున్నాడు. తలుపు తెరిచి చూడగా, ఏడు గోతాలూ ప్రత్యక్షంగా కనబడినై.

గబగబలాడుతూ మంగలి ఆ గోతాలు ఒక్కొక్కటే విప్పి చూడసాగాడు. వరసగా ఆరు గోతాలనిండుగా మిలమిల మెరుస్తూ వరహాలున్నై. ఏడవగోతం విప్పి చూచాడు. కాని అందులో ఏవీ లేవు. ఒక్క చీటీ మాత్రం ఉంది.

ఆ చీటీ మీద ఈవిధంగా రాసి ఉంది. 'ఈ ఏడవగోతం నింపటం నీవంతు. అది నింపగలిగితేనే నేను నీకు ఇచ్చిన మిగతా ఆరు గోతాల వరహాలూ నీకు దక్కుతై. అది గనక నింపలేకపోయావంటే ఈ ఆరు గోతాలూ నీకు ఏవిధంగా వచ్చాయో అదేవిధంగా మాయమవుతాయి.'

ఈ చీటీ కంటబడేసరికి, ఎలా అయినా శ్రమపడి ఆ ఏడవగోతం కూడా పూర్తి చేయాలి అని తీవ్రమైన కాంక్ష పట్టుకుంది మంగలికి.

ఒక గోతం నిండుగా వజ్రాలు నింపాలీ అంటే అంత తేలికగా అయ్యేపనా? కాని, మంగలికి మాత్రం తను కడుపు మాడ్చుకుని అయినా సరే, ఆ గోతం నింపి, ఆ ఆరుగోతాల వరహాలూ పోకుండా నిలవచేసుకోవాలని దురాశ కలిగింది.

మొట్టమొదట అతను, తన ఇంట్లో ఉన్న వెండి, బంగారు నగలన్నిటినీ అమ్మివేసి వాటిని వరహాలుగా మార్చి, ఏడవగోతంలో పోశాడు.

కాని వరహాలు గోతంలో ఒక మూలకి కూడా చాలలేదు.

ఇది పని కాదని చెప్పి, తను కడుపు నిండా తిండి తినడం మానుకున్నాడు. కడుపు మాడ్చుకుని అయినా సరే ఆ గోతం కూడా వరహాలతో నింపాలని అతని ఉద్దేశం. కాని నెలలతరబడి వాడు అలా కడుపుమాడ్చుకుని ధనం కూడబెట్టినా అది నిండలేదు.

ఆ మంగలి ఒకనాడు రాజును దర్శించి, 'ప్రభూ! చాలా కష్టంగా ఉన్న దండి. జీతం బొత్తిగా చాలటం లేదండి. ఏలినవారు కటాక్షించాలండి,' అంటూ దీనంగా మనవి చేసుకున్నాడు.

రాజు జాలిపడి అభిమానంతో ఆ నెల నుంచి వాడి జీతం రెట్టింపు చేశాడు. మంగలి ఈ జీతమంతా కూడగట్టి, ఏడో గోతంలో వేస్తూ వచ్చాడు.

మరి కొన్ని నెలలు గడిచినై. కాని ఎంతకూ గోతం నిండదే!

ఆరోజు మొదలుకొని మంగలికి పెద్ద బెంగపట్టుకుంది- 'నేను ఎంత ప్రయత్నించినా ఈ ఏడో గోతం నింపలేకపోతున్నాను. ఇది నింపలేకపోతే మిగతా ఆరూ కూడా మాయమయిపోతాయి కదా? ఏమి చెయ్యనా?' అని.

వాడికి ఇరవైనాలుగు గంటలూ ఇదే దిగులు.

ఇలా ఉండగా, మరికొన్నాళ్లకి ఒక రోజున అతను మామూలుగా రాజు గారికి క్షవరం చెయ్యటానికి వచ్చాడు.

మంగలి చాలా దీనంగా ఉండటం రాజు కనిపెట్టి, 'ఏమిరా అబ్బాయీ! నీ జీతం ఇప్పుడన్న దానిలో సగం ఉన్నప్పుడే నువు ఉత్సాహంగానూ, నిశ్చింతగానూ ఉండేవాడివే? ఇప్పుడిట్లా బిక్క మొగం వేసుకుని ఉండటానికి కారణ మేమిటి? నీకేమి కీడు మూడింది?



కొంపతీసి, ఆ ఏడు గోతాలూ నీకు తటస్థపడలేదు కద!' అని ప్రశ్నించాడు.

'ఆ ఏడు గోతాలు నీకు తటస్థపడ లేదు కద!' అని రాజు అనేసరికల్లా మంగలి ఉలిక్కిపడ్డాడు.

'అవును మహారాజా! కాని, ఈ సంగతి తమరికెలా తెలిసిందండి?' అంటూ, కంగారుగా ప్రభువును అడిగాడు మంగలి.

అప్పుడు రాజు, 'ఓరి పిచ్చివాడా! ఎవరు చెప్పేదేమిటి? నీకింకా తెలియనే తెలియదా? అడవిలో చెట్టుపైన ఉన్న యక్షుడు ఈ ఏడుగోతాలనూ ఎవరికైతే దత్తం చేస్తాడో, వాళ్లయందు ఈ లక్షణాలన్నీ కనిపిస్తాయి. యక్షుడు నాకూ

ఇలాగే 'ఈ గోతాలను తీసుకో' అని చెప్పి ఇచ్చాడు. నీకు కనిపించినట్లుగానే ఆరు గోతాలనిండుగా వరహాలూ, ఏడో గోతంలో చీటీ కనిపించినై. కాని నీలాగా నేను ఏడోగోతం నింపడానికి ప్రయత్నించ దలచలేదు. ఎందువల్లనంటే ఇందులో ఏదో మోసం ఉండబట్టే ఈ గోతాలింత తేలికగా సమకూరినై. ఈ ఏడవగోతం నింపటానికి ప్రయత్నించడం శుద్ధ తెలి వితక్కువ.

కనుక నేను మళ్ళీ వెంటనే ఆ యక్షు డున్న చెట్టుదగ్గిరకి వెళ్ళి 'నీ గోతాలు నాకక్కర్లేదు. నీవి నీవే తీసుకో,' అని కేక వేశాను.

ఇలా కేకవేసి నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి ఆ గోతాలు ఎలా వచ్చాయో అలాగే మాయమైనాయి.

కనుక నువ్వు కూడా తక్షణమే పోయి వాటిని తిరిగి యక్షుడికి ఇచ్చివేయి వెళ్ళు. ఆలస్యం చేయకు.' అని మంగలికి సలహా చెప్పాడు.

రాజు చెప్పిన సదుపదేశానికి మంగలి బుద్ధి తెచ్చుకొని, యక్షుడు ఆవహించిన ఆ చెట్టు వద్దకు పోయి, 'ఓయి యక్షుడా! నీ గోతాలు నీవే తీసుకో బాబూ! నాకు అవి ఎంతమాత్రం అక్కరలేదు,' అని వేడుకున్నాడు.

ఇందుకు బదులుగా యక్షుడు అశ రీరవాక్కుతో 'సరే అలాగే తీసుకుం టాను. నీవు వెళ్ళు!' అని జవాబు చెప్పాడు.

వెంటనే మంగలి ఇంటికి చేరుకొని చూచేసరికి, ఆ ఏడు గోత్రాలూ ఎంత చిత్రంగా వచ్చాయో, అంత చిత్రంగానూ అదృశ్యమైపోయినై.

కాని దురదృష్టమేమంటే అవి మాయ మైపోవటమే కాక, వాటితో పాటు పాపం మంగలి ఇన్నాళ్లనుంచీ కూడబెట్టిన ధన మంతా ఎగిరి చక్కాపోయింది!





# విధివిలాసం

కళింగరాజ్యాన్ని పరిపాలించే కీర్తివర్మకు, మారువేషం ధరించి రాత్రి సమయంలో నగర సంచారం చేస్తూ, ప్రజల యోగ క్షేమాలు తెలుసుకునే అలవాటు ఉంది.

ఒక రోజు చీకటి పడగానే రాజు, మంత్రి సుబుద్ధి ఇద్దరూ బాటసారులవలే వేషాలు ధరించి నగర సంచారానికి బయలుదేరారు. ఒక వీధిలో ఒక ముష్టివాడు వారికి కనిపించాడు.

రాజు, మంత్రి ఆ ముష్టివాణ్ణి సమీపించి, అతణ్ణి 'నీ పేరేమిటి?' అని అడిగారు.

'ఎల్లయ్య బాబూ,' అని ఆ ముష్టివాడు జవాబిచ్చాడు.

'ఎంత కాలం నుంచి, నీవు ఇలా ముష్టి ఎత్తుకొని జీవిస్తున్నావు? అసలు నీ పరిస్థితి ఏమిటి?' రాజు అతణ్ణి అడిగాడు.

'చాలాకాలం నుంచి బాబు, నా గురించి ఏమని చెప్పను. నా తలరాత బాగులేదు. పైవాడు గీసిన గీత మారేంతవరకు నా గతి ఇంతే,' అని ఆ ముష్టి వాడు జవాబు చెప్పి ముందుకు వెళ్ళిపోయాడు.

రాజు మంత్రి ఇంకో వీధి లోనికి వెళ్లే సరికి వారికి మరొక ముష్టివాడు కనిపించాడు. రాజు అతణ్ణి కూడా అలాగే 'ఏమిటి నీ పరిస్థితి' అని అడిగాడు.

'నా పేరు మల్లయ్య బాబూ, ఏం చెప్పను. మన దేశాన్ని పరిపాలించే ధర్మ ప్రభువైన మనరాజు గారికి నాపై దయ కలుగలేదు. ఆయన కరుణించే వరకు నా స్థితి ఇంతే.' అని ఆ బిక్షగాడు చెప్పి వెళ్లిపోయాడు.

ఆ బిక్షగాడు చెప్పింది వినగానే రాజు మనస్సు పులకరించిపోయింది. అమితా

దొడ్డిపట్ల పూర్ణిమ

నందంతో రాజు మంత్రితో ఇలా అన్నాడు. 'చూశారా! వీడికి నేనంటే ఎంత గౌరవమో, ఎల్లయ్య కనిపించని దేవుని దయ కావాల న్నాడు. ఈ మల్లయ్య నాపై భక్తితో, నా దయ కావాలనుకుంటున్నాడు. వీడికి మనం తప్పక సహాయం చేయాలి.'

దానికి మంత్రి సుబుద్ధి, 'మనం మానవ సహాయం చేసినంత మాత్రాన, ఆ సహాయం అందుకునే భాగ్యం మనుషులకు లేకపోతే ఎవరి బతుకూ బాగుపడదు. మీరు చేసే సహాయం అతడికి దక్కాలని ఉంటే అతడి బతుకు బాగుపడుతుంది లేకుంటే లేదు,' అన్నాడు.

తనను కించపరిచినట్లు భావించిన రాజు, చిరుకోపంతో 'సరే, నేను వీడికి సహాయం చేస్తాను. ఈ మల్లయ్య బతుకు ఎందుకు బాగుపడదో చూస్తాను,' అన్నాడు.

''సరే అలానే చేయండి. కాని మీ సహాయం మల్లయ్యకి అందుతుందో లేదో తెలియా లంటే అతడికి మీరు సహాయం చేస్తు న్నట్లు చెప్పకుండా చెయ్యండి,' అని అన్నాడు మంత్రి. రాజు 'సరే' అని అందుకు ఒప్పుకున్నాడు.

మరుసటి రోజు, రాజు మల్లయ్యను కోటకు పిలిపించి, వాడికి కడుపారా భోజనం పెట్టి, కొత్త బట్టలు, ఒక పెద్ద కాయ ఇచ్చి, పంపించాడు.

ఆరునెలలు గడిచిన తర్వాత ఒక రాత్రి రాజు, మంత్రి మారువేషాలు ధరించి, మరలా నగర సంచారానికి బయలుదే రారు. వారికి మల్లయ్య యధాప్రకారంగా ముష్టి ఎత్తుకుంటూ కనిపించాడు.

కాని వారికి ఎల్లయ్య మాత్రం కని పించలేదు. 'నీతో పాటే ముష్టి ఎత్తుకునే



ఎల్లయ్య ఏడీ' అని రాజు మల్లయ్యను అడిగాడు.

'ఎల్లయ్యకు ముష్టి ఎత్తుకునే బాధ తప్పింది. బాబూ. వాడు ధనవంతుడై పోయాడు. ఆ కనబడే పెద్ద భవంతే వాడి నివాసం,' అని మల్లయ్య వారికి చెప్పి, ఎల్లయ్య నివాసముండే భవనాన్ని కూడ చూపించి వెళ్ళిపోయాడు.

రాజు సహాయం చేసింది, రాజు సహాయాన్ని కోరుకున్న మల్లయ్యకే. కాని దైవ సహాయాన్ని ఆశించిన ఎల్లయ్య ఎలా ధనవంతుడు అయ్యాడో రాజుకు అర్థం కాలేదు.

ఆ మరుసటి రోజు రాజు ఎల్లయ్యను సభకు రప్పించి, 'నీవు ధనవంతుడివి ఎలా అయ్యావు,' అని ప్రశ్నించాడు.

దానికి ఎల్లయ్య, 'అయ్యా! నేను చనిపోయిన నా తండ్రికి తద్దినం పెట్టడానికని, అంగడిలో ఒక గుమ్మడి కాయ కొన్నాను. దాన్ని కోసి చూస్తే ఆ కాయ నిండా వజ్రవైఢూర్యాలు, రత్నాలు ఉన్నాయి. దేవుడు నాపై కరుణించాడు. ఆ ధనంతో నా దరిద్రం తీరిపోయింది,' అని సంతోషంగా చెప్పాడు.

ఆ తర్వాత రాజు మల్లయ్యను పిలిపించి, 'నీకు నేనిచ్చిన గుమ్మడి కాయను ఏం చేశావు?' అని అడిగాడు. అందుకు మల్లయ్య, 'అయ్యా, ఆ గుమ్మడి కాయను అంగడిలో దుకాణాదారుడికి, ఒక వరహాకు అమ్మివేశాను,' అని చెప్పాడు. రాజు వెంటనే మంత్రి వైపు చూసి 'మీరు చెప్పింది నిజం. సహాయం అందుకునే స్థితి, వివేచన లేకుంటే ఎవరి బ్రతుకులూ మారవు. నేను గుమ్మడి కాయలో వజ్ర, వైఢూర్య, రత్నాలు పెట్టి మల్లయ్యకు ఇచ్చాను. అతడు ఆ గుమ్మడి కాయను అంగడి దుకాణదారునికి అమ్మేశాడు. కాని భగవంతుడి సహాయం కోరుకున్న ఎల్లయ్య తనకు తెలియకుండానే ఆ కాయను కొనుక్కొని అనుకోని భాగ్యం పొంది స్థితిమంతుడయ్యాడు. తానొకటి తలిస్తే మరొకటి జరిగిందంటే ఇదే కద,' అన్నాడు కీర్తివర్మ.



# మహా మూర్ఖుడు!

అడవిలో కట్టెలు కొట్టేవాడొకడు, మిట్టమధ్యాహ్నం వేళ ఏటిలో నీళ్లు తాగి తిరిగి వస్తుండగా, ఇసుకలో ఏదో మెరుస్తూ కనిపించింది. వాడు దాన్ని పైకి తీసి పరీక్షగా చూడసాగాడు.

అంతలో ఆ దారినపోతున్న వజ్రాలవ్యాపారి ఒకడు వాణ్ణి సమీపించి, 'ఏమిటలా వింతగా చూస్తున్నావు? అది గాజురాయి! ఇరవై రూపాయలిస్తాను, నాకివ్వు,' అన్నాడు.

ఇది విన్న కట్టెలు కొట్టేవాడు, అదేదో ఖరీదైన రాయి అయి ఉంటుందనుకుని, 'ముప్ఫయి రూపాయలివ్వండి, ఇస్తాను,' అన్నాడు. 'ఆ రాయి పదిరూపాయలకన్న ఎక్కువ చెయ్యదు. సరే, ఏదో పేదవాడివి సాయపడాలనుకుంటున్నాను. పాతిక రూపాయలిస్తాను.' అన్నాడు వజ్రాల వ్యాపారి.

'ముప్ఫయి రూపాయలకు తక్కువయితే ఇవ్వను,' అన్నాడు కట్టెలు కొట్టేవాడు మొండిగా.

వజ్రాల వ్యాపారి కొంచెం సేపు ఆలోచించాడు. ఈ అడవిలో దాన్ని కొనేందుకు ఎవడూ రాడని అతడికి తోచింది. ఆ కారణంగా వ్యాపారి, కట్టెలు కొట్టేవాడితో, 'మరీ అంత దురాశకు పోకు! నేను ఈ పక్క గ్రామానికి వెళ్లి గంటలో తిరిగివస్తాను. పాతికరూపాయల కంటే నీకు చిల్లిగవ్వ ఇచ్చేది లేదు,' అంటూ వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత గంటసేపటిలో తిరిగివచ్చిన వజ్రాల వ్యాపారి, కట్టెలు కొట్టేవాడితో, 'ఆలోచించుకున్నావా? ఆ పాతికా ఇస్తాను, ఆ రాయి ఇచ్చెయ్యి,' అన్నాడు.

'ఇంకెక్కడి రాయి! ఇంతకు ముందే మరొకరికి నూరు వరహాలకు అమ్మేశాను,' అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

వజ్రాల వ్యాపారి అదిరిపడి, 'నువ్వు మూర్ఖుడివి! అది గాజురాయి కాదు. దాదాపు పదివేల వరహాల విలువ చేసే వజ్రం!' అన్నాడు.

అందుకు కట్టెలు కొట్టేవాడు, 'నాకు దాని విలువ తెలియదు. కానీ దాని విలువ తెలిసీ అదనంగా అయిదు రూపాయలు ఇవ్వడానికి ఇష్టపడని నువ్వు, మహామూర్ఖుడివి!' అన్నాడు. – ప్రేమ్ కుమార్





# శిథిలాలయం -15

(శిఖిముఖీ అతడి అనుచరులూ ఆకాశగుహ ప్రాంతం చేరేసరికి, అక్కడ చెంచులు కోలాహలంగా నాట్యాలు చేస్తున్నారు. నాగుమల్లి బంధించబడిన గుడిశెలో శిఖిముఖికి చెంచు వాడొకడు పట్టుబడ్డాడు. శిఖిముఖి పులిచర్మం కప్పుకున్నాడు. శిథిలాలయ పూజారి అది గ్రహించగానే, విక్రమకేసరి పులిని బోను నుంచి వదిలాడు. తరవాత -)

ఈసారి తమమీదికి వస్తున్నది, నిజమైన పులి అని శిథిలాలయ పూజారికీ, బడేచెంచుకూ తెలిసిపోయింది. పులి ఆసరికే నలుగురైదుగురు చెంచుల్ని పంజా దెబ్బలతో పడగొట్టింది. ఇక ఇక్కడ ఉండటం ప్రమాదం అని తెలుసుకుని శిథిలాలయ పూజారి, ఆకాశగుహ పక్కనున్న కొండ అంచు కేసి పరిగెత్తసాగాడు. బడేచెంచు తన గుహకేసి పారిపోతూ, అనుచరులనుద్దేశించి 'చచ్చు వెధవల్లారా! పులిని చూసి భయపడుతున్నారా? నెగళ్లలో మండే కట్టెలు తీసుకుని ఎదురు తిరగండి!' అని కేకలు పెట్టాడు.

చెంచులు తమ నాయకుడు చెప్పినట్లే భగభగ మండే కట్టెపుల్లలు తీసుకుని పులి మీదికి పరిగెత్తారు. నిప్పంటే భయపడని అడవి మృగం ఉండదు. పులి మంటలు చూస్తూనే బెదురుకుని వెనుదిరిగింది. ఇంతలో శిథిలాలయ పూజారి పెద్ద గొంతుతో, 'ఎక్కడ్రా, భేరుండం! త్వరగా వచ్చి చావు,' అంటూ అరిచాడు.

పులి ప్రవేశంతో ఆకాశగుహ ముందు రేగిన గందరగోళంలో శిఖిముఖి, పూజారి ఎటు పరిగెత్తిపోతున్నదీ గమనించలేదు. బడే చెంచు అందుబాటులో ఉన్నట్లు

దాసరి సుబ్రహ్మణ్యం




'ఈ కటిక చీకటిలో పైకెగరటం ప్రమాదం, ముందు లోయలోకే దిగిపోవాలి. చాప చుట్టి గట్టిగా కట్టావా? తాటి మోకును నే చెప్పిన కొండ రాతికి బలంగా బిగించావా?' అని అడిగాడు శిథిలాలయ పూజారి.

'తమ ఆజ్ఞ ప్రకారం అంతా సిద్ధపరిచి ఉంచాను. కొండకింది లోయలోకి ఎగిరి పోదామంటావా దేవా?' అన్నాడు సవరభే రుండం.

'అలాంటి పిచ్చిపని చేయకు. కాళ్లూ, చేతులూ విరిగి చస్తావు. మోకు సాయంతో నేను ముందుగా లోయలోకి దిగుతాను. నువ్వు చాప చుట్టును ఎత్తుకుని కాస్త వెనకగా దిగు,' అన్నాడు పూజారి.

కనబడేసరికి, అతడు అటుకేసి పరిగెత్తాడు. శిఖిముఖి మీద ఒక కన్ను వేసి ఉంచిన పూజారి, ఇది చూస్తూనే తన నౌకర్ని గట్టిగా కేకపెట్టి పిలిచాడు.

'పూజారి దేవా, ఇక్కడున్నాను, వచ్చే, వచ్చే!' అంటూ సవరభేరుండం శిథిలా లయ పూజారి దగ్గిరకు పరుగు పరుగున వచ్చి చేరాడు.

'ఇక్కడ మనం వచ్చిన పని తీరిపో యింది. ఇక మన ప్రయాణం బ్రహ్మపుత్రా నదీ లోయలకే,' అంటూ పూజారి కొండ అంచుకేసి కదిలాడు.

'అయితే, ఈ భేరుండాన్ని ఆకాశంలోకి ఎగురమని తమ సెలవా?' అన్నాడు సవర భేరుండం.

ఇద్దరూ కొండ అంచుకు పోయారు. అక్కడ ఒక పెద్ద రాతికి బలమైన మోకు ఒకటి కట్టబడి ఉన్నది. రాతి పక్కన తాళ్లతో కట్టబడిన చాప చుట్ట ఒకటి ఉన్నది.

అందులో బంధించబడి ఉన్నది నాగు మల్లే! ఆమె తల మాత్రం బయటకి కన బడుతున్నది. అరవకుండా ఉండేందుకు ఆమె నోటికి అడ్డంగా ఒక వస్త్రం ముక్క బిగించారు.

శిథిలాలయ పూజారి, నాగుమల్లి కేసి ఓ మారు చూసి, తృప్తిగా తలాడించి, రాతి దగ్గిరకు పోయి మోకును లాగి చూశాడు. తరవాత భేరుండం కేసి తిరిగి, 'మోకు లోయలోకి దిగేందుకు సరిపడ ఉన్నదా?' అని ప్రశ్నించాడు.

‘లోయలోకేంటి, దేవా! నువ్వు కాస్త మంత్రం ప్రయోగిస్తే అది బ్రహ్మపుత్రానది ఉత్తరం గట్టునే తాకేస్తుంది,’ అన్నాడు భేరుండం. ‘ఈ రాత్రి తాగొద్దని చెప్పానే, తాగావా? ఏమిటా పిచ్చి మాటలు! నోరు మూసుకుని నా వెనగ్గా లోయలోకి దిగు,’ అంటూ శిథిలాలయ పూజారి తాడు పట్టుకుని, కొండ మీంచి లోయలోకి దిగసాగాడు.

సవర భేరుండం చేతుల్ని పైకీ కిందికీ ఓ సారి ఊపి, ‘అంతా పూజారి దేవుడి ఆజ్ఞ’ అంటూ నాగుమల్లి కట్టబడి ఉన్న చాప చుట్టను భుజానికి ఎత్తుకోబోయేంతలో, ఆకాశ గుహ వైపు నుంచి పెద్ద రణగొణ ధ్వని వినిపించింది.

భేరుండం బితుకుబితుకు మంటూ ఆకాశగుహకేసి ఓ క్షణకాలం చూసి, ‘పూజారి దేవా, ఆ శిఖిముఖి వాళ్లు మన బడేచెంచు మీద దాడి చేస్తున్నట్టున్నది. మనం చెంచుకు సాయం పోవద్దా?’ అన్నాడు.

‘ఆ చెంచు చవటకు సాయం పోవటమా? ఛీ! నోరు మూసుకుని త్వరగా రారా, ఆ చెంచు వెధవ, నే చెప్పిన పని ఒక్కటీ సక్రమంగా చేయలేకపోయాడు. వాణ్ణి ఆ దయ్యాలపోతు మోసం చేస్తే, నేను వాళ్లిద్దర్నీ మంత్రశక్తితో బుద్ధిహీనుల్ని చేసి, నాగుమల్లిని వశం చేసుకున్నాను. ఇకవాళ్లని, కొండ మీంచి దూకి చావనీయ్,’ అన్నాడు శిథిలాలయ పూజారి.



‘పాపం, బడేచెంచు మంచివాడు! అతడికి శిఖిముఖి చేతుల్లో చావు రాసిపెట్టి ఉన్నది గామాలు!’ అని ఓసారి గట్టిగా గొంతు సవరించుకుని సవరభేరుండం నాగుమల్లిని వీపుకు వేలాడ వేసుకుని మోకు సాయంతో లోయలోకి దిగసాగాడు.

సవరభేరుండం ఊహించినట్లే, ఆకాశ గుహ ముందు శిఖిముఖీ అతడి అనుచరులూ, బడే చెంచుతో పాటు అతడి ముఠా వాళ్లను చుట్టుముట్టారు.

ఆ ప్రయత్నంలో చెంచుల్లో ఇద్దరు ముగ్గురు బాగా గాయపడ్డారు కూడా. సాధ్యమైతే ఎలాంటి రక్తపాతం లేకుండా చెంచుల్ని లొంగదీసుకుని నాగుమల్లిని

బంధవిముక్తురాల్ని చేసి తీసుకుపోవాల నుకున్న శిఖిముఖి, బడే చెంచుతో,

'మీ వాళ్లనందర్నీ ఆయుధాలు కింద పడవేయమని చెప్పు, అలా చేస్తే మీలో ఎవరికీ హాని కలిగించను. నాక్కావలసింది సవరనాయకుడి కూతురు నాగుమల్లి,' అన్నాడు.

'నాగుమల్లినే కాదు శిథిలాలయ పూజారిని కూడా మా వశం చెయ్యాలి,' అన్నాడు విక్రమకేసరి ఈటెను బడేచెంచు కేసి గురిచేస్తూ.

బడేచెంచు గడగడ వణికిపోతూ, 'నా తప్పేమీ లేదు. ఏదో దురాశ కొద్దీ డబ్బాశ పడి నాగుమల్లిని పట్టి తెచ్చాను. ఆవిడ తండ్రి చాలా డబ్బున్న వాడని విన్నాను. కాని చివరికిట్లా జరిగింది!' అన్నాడు.

'జరగబోయే దానితో పోలిస్తే, ఈ జరిగింది నీకు సన్మానం కింద లెక్క. ముందు చెప్పు, ఆ పూజార్నీ, నీ దయ్యాల పోతునూ ఎక్కడ దాచావ్?' అంటూ విక్రమకేసరి, బడేచెంచు కేసి రెండడుగులు వేశాడు.

బడే చెంచు మరింతగా వణికిపోతూ, ఏదో అనబోయేంతలో, కంచె ప్రాంతాల్నించి, దయ్యాలపోతు ఏడుపుగొంతుతో, 'ఈ పులి మాటే అందరూ మర్చినట్టుంది. బాబులూ, వచ్చి సాయపడండి! అది నా గొంతు కొరికేందుకు చూస్తున్నది,' అని కేక పెట్టాడు.

దయ్యాలపోతు కేక వింటూనే, విక్రమకేసరి ఇద్దరు ముగ్గురు అనుచరులతో కంచె దగ్గరికి పరిగెత్తాడు. పులి కంచె కానుకుని నిలబడి ఉన్నది. చెంచు దయ్యాలపోతు, మోకాళ్ల మీద కూర్చుని, ఆరిపోవడానికి





సిద్ధంగా ఉన్న ఒక నిప్పుకట్టెను దాని కేసి ఊపుతున్నాడు. పులి మీదికి దూకేందుకు కోరలు చాచి గుర్రు పెడుతున్నది.

'ఆ దయ్యాలపోతును తెల్లారింతర్వాత పులికి ఆహారంగా వేద్దాం. ప్రస్తుతానికి ఇతడితో మనకు పని ఉన్నది. మీరు రెండు మూడు మండే కట్టెలు తేండి. పులిని తిరిగి బోనులోకి పంపుదాం,' అన్నాడు విక్రమ కేసరి.

విక్రమ కేసరి ఇలా అనగానే శభరులు సెగల్ల దగ్గిరకు పరిగెత్తిపోయి బాగా మండుతున్న కట్టెలతో తిరిగి వచ్చారు. విక్రమ కేసరి, దయ్యాలపోతు పారిపోకుండా ఒకణ్ణతనికి కాపలా పెట్టి, రెండు చేతుల్లోరెండు మండుతున్న కట్టెల్ని పట్టుకుని పులిని సమీపించాడు. పులి పెద్దగా ఓసారి గాండ్రించి, వెను దిరిగి కంచెవారగా నడవసాగింది. అది కంచె అవతల బోను ఉన్న ప్రదేశం చేరగానే, ఒకడు దాన్ని రెండవ వైపు నుంచి అటకాయించాడు.

పులి పంజా సాచి అతనిమీది దూక బోయినదల్లా, భయపడి బోనులో జొరబడింది. వెంటనే విక్రమ కేసరి కంచె పైకెక్కి బోను తలుపును దభీమంటూ మూసేశాడు.

విక్రమకేసరి, చెంచు దయ్యాలపోతు దగ్గిరకు తిరిగి వచ్చేసరికి, వాడు జుట్టు పీక్కుంటూ మతిపోయిన వాడిలా గొణుక్కుంటున్నాడు. విక్రమకేసరి కాపలా ఉన్న శబరవాణ్ణి పక్కకు పిలిచి, 'ఏమిటి వాడు వాగేది? పారిపోవాలని ఏమైనా ప్రయత్నం చేశాడా?' అని అడిగాడు.

'దయ్యాలపోతుకు పిచ్చెక్కిందని నాకు అనుమానం కలుగుతున్నది దొరా! పూజారి గాడెక్కడ అని అడిగితే, నా మాట వినిపించుకోకుండా, వాడెత్తుకు పోయాడు. చావు తప్పదు, పులివాత తప్పదు. అంటూ ఒకే వరసన గొణుగుతున్నాడు,' అన్నాడు శబరుడు.

విక్రమకేసరి, దయ్యాలపోతును భుజం పట్టుకుని కుదిలించి, 'ఆ గొణుగుడు మాని, నిజం చెప్పుఎత్తుకుపోయిందెవర్ని? చావు తప్పందెవరికి? నాగుమల్లిని ఎక్కడ దాచావు?' అని ప్రశ్నించాడు.

దయ్యాలపోతు ఆ ప్రశ్నతో ఈ లోకం లోకి వచ్చినవాడిలా విక్రమకేసరిని నిలువు గుడ్లేసుకుని ఓ క్షణకాలం చూసి, 'నాగు మల్లిని నేను దాచిన గుడిసెలోంచి ఆ పూజారి ఎత్తుకుపోయాడు. నేను అన్న మాట తప్పానని శిఖిముఖి నన్ను పులికి మేతగా వేస్తాడు. నాకు చావు తప్పదు,' అన్నాడు బొంగురుగొంతుతో.

దయ్యాలపోతు మాటల్తో, విక్రమకేసరికి నాగుమల్లిని శిథిలాలయ పూజారి ఆకాశ గుహప్రాంతం నుంచి చల్లగా మరెక్కడికైనా దాటవేశాడేమో అన్న సంశయం కలిగింది. అతడు మారు మాటాడకుండా దయ్యాల పోతును మెడ పట్టుకుని లాక్కువచ్చి, అతడన్న మాటలు శిఖిముఖికి చెప్పాడు.

శిఖిముఖి పట్టరాని కోపంతో ఈటె పైకెత్తి, 'దయ్యాలపోతూ, నీకు చావు తప్పదు. నువ్వూ, ఆ పూజారి దుర్మార్గుడూ తోడు దొంగలు. వాడి కోసం ఈ చుట్టు పక్కల అంతా గాలించాం, కనిపించలేదు. వాడు దాగే రహస్య స్థలం ఎక్కడ?' అన్నాడు.

'ఆ దుర్మార్గుడూ నేనూ బద్ధశత్రువులం, దొరబాబూ! ఆ సంగతి మా బడేచెంచు క్కూడా తెలుసు. నాగుమల్లిని నువ్వు దాయ మన్న గుడిసెలోనే దాచాను. వాడూ, వాడి నౌకరూ చీకటి పడింతర్వాత ఒకటికి రెండు సార్లు కొండ అంచుకేసి పోవడం చూశాను. అక్కడేమన్నా..' అంటూ దయ్యాలపోతు ఆగిపోయాడు.



శిఖిముఖి, దయ్యాలపోతు మెడ పట్టు కుని, 'త్వరగా రా, ఆ ప్రదేశం ఏదో చూపు,' అన్నాడు తొందరపెడుతూ.

దయ్యాలపోతు కొండ అంచుకేసి గబ గబా నడిచారు. అతని వెన్నంటి పోయిన శిఖిముఖీ, విక్రమకేసరులకు శబరవాళ్లు తెచ్చిన కాగడాల వెలుగులో, ఒక పెద్ద గండశిలా, దానికి కట్టి ఉన్న బలమైన తాటి మోకూ కనిపించినై. శిఖిముఖి చప్పున వంగి మోకును బలంగా లాగి చూశాడు. అది బిగుసుకుపోయి ఉంది. అప్పుడతను తల వంచి, దాన్ని చెవికానించుకుని కొద్ది సేపు విని, 'మోకు ఆధారంతో ఆ పూజారీ వాళ్ళు కొండమీంచి లోయలోకి దిగిపోతున్నారు, అనుమానం లేదు,' అన్నాడు.

'అలా అయితే ఒక్క వేటుకు మోకు నరకండి. ఆ నీచుడు కింది లోయలో రాళ్ళ మీద పడి తల పగిలి చస్తాడు,' అన్నాడు బడేచెంచు ఆ సమయానికి అక్కడకి వచ్చి.

'చెంచూ! తొందరపడి అలాంటి బుద్ధి తక్కువ పని చేసేవు. అలా మోకు నరికితే చచ్చేది ఒక్క పూజారి కాదు. అతడి వెంట నాగుమల్లి కూడా ఉన్నది,' అన్నాడు శిఖిముఖి.

అతడు ఇలా అనేంతలో చెంచుల్లో కొందరు తమ చేతుల్లో ఉన్న కాగడాలను లోయలోకి విసిరారు. వాటి వెలుగులో మోకు సాయంతో కిందికి దిగిపోతున్న శిథిలాలయ పూజారీ, సవరభేరుండం, అతడి భుజాన వేలాడుతున్న చాపచుట్టా- అందరికీ కనిపించినై.

'శిఖీ! ఇప్పుడేమిటి ఉపాయం? ఆ దుర్మార్గుడు నాగుమల్లితో కూడా మనకు కనిపించకుండా పారిపోయే ప్రమాదం ఉన్నది,' అన్నాడు విక్రమకేసరి.

'నేనూ మరో మోకు సాయంతో వాడి వెంట బడతాను. ఈ ఉన్న మోకు నలుగురిని మోయలేకపోవచ్చు,' అని శిఖిముఖి బడేచెంచుతో' త్వరగా ఒకమోకు తెప్పించు,' అని చెప్పాడు.

క్షణాల మీద చెంచులు ఒక మోకు తెచ్చారు. శిఖిముఖి దాని కొస నొకదాన్ని గండశిలకు కట్టించి, మిగతా దాన్ని లోయలోకి జార్చి, దాని వెంట కిందికి దిగుతూ, 'కాగడాలను పూజారీ వాళ్లకు తగలకుండా కొంచెం దూరంగా విసరండి,' అన్నాడు.

చెంచులు విసరిన కాగడాల వెలుగులో శిథిలాలయ పూజారీ, సవర భేరుండం దాదాపు లోయ అడుగు భాగాన్ని చేరబోవటం శిఖిముఖికి కనిపించింది. వెంటనే అతడు మోకు వెంటసర్రుమంటూ వేగంగా లోయలోకి దిగసాగాడు.

-(ఇంకా ఉంది)






# నేను సైతం...

బుజ్జి, నాని పాఠశాల నుంచి తిరిగి వస్తున్నారు.

ఆరోజు బుజ్జికి కళ్లు ఒకటే నొప్పులుగా ఉండటమే కాకుండా చాలా నీరసంగా కూడా ఉంది. అమ్మకి చెబితే భోజనం గిన్నెలు తెరిచి చూసి 'ఇందుకే మరి నీరసం.. తీసుకెళ్ళిన అన్నం అలాగే తెచ్చేస్తే నీరసం కాక మరేంటి?' అని కోప్పడుతుంది.

ఇంటి గుమ్మం ఎక్కబోతున్న నాని కూడా కళ్లు నులుముకుంటూ తన్నుకుని కిందకి పడబోయాడు. బుజ్జి గభాలున తమ్ముణ్ణి పడిపోకుండా ఆపి, 'నానీ! నువ్వుకూడా నాలాగా అలా కళ్లు నులుముకుంటున్నా వేంటి? కంట్లో ఏమన్నా నలక పడిందా?' అంది.

'కాదు బుజ్జీ! ఎందుకో ఇందాకటినుంచి ఒకటే మండిపోతున్నాయి.' అన్నాడు నాని మళ్ళీ కంటిమీదికి చెయ్యి పోనిస్తూ. ఈసారి నాని ఆ పని చెయ్యకుండా లోపలినుంచి వచ్చిన అత్తయ్య చెయ్యి అడ్డుకుంది. అత్త య్యని చూడగానే ఇద్దరిలోనూ ఉత్సాహం తన్నుకుని వచ్చింది.

ఎందుకంటే అత్తయ్య వచ్చిందంటే చక్కగా పనికొచ్చే కబుర్లు చెప్పి బాగా నవ్విస్తుంది. పైగా వాళ్ళిద్దరికీ స్కూలులో జరిగే పోటీల్లో బహుమతులు తెచ్చుకునేం దుకు బోలెడు సలహాలు ఇస్తుంది మరి.

ఏదో అడగబోతున్న నానిని వారిస్తూ. 'మొహాలు ఎలా వాడిపోయాయో.. ముందు ఇద్దరూ చల్లని నీళ్లతో మొహం కాళ్లూ చేతులు కడుక్కరండి. మీకోసం అరటికాయ బజ్జీలు చేసాను. అవి తింటూ చక్కగా కబుర్లు చెప్పు కుందాం.' అంది అత్తయ్య.

ఇద్దరూ బుద్ధిగా తలూపి అత్తయ్య చెప్పిన పని చేసేసి వచ్చి అత్తయ్యకి చెరో పక్కకి చేరిపోయారు.

'బుజ్జీ, నానీ.. మీరిద్దరూ పాఠశాలనుంచి

పి.వి. శేషారత్నం




ఎలా వచ్చారు?' అంది అత్తయ్య ప్రేమగా ఆరా తీస్తూ.

'బడి నుంచి నడుచుకుంటూ వచ్చాంలే. అందుకే మరి నాన్నని ఎదురించి మామయ్యలాగా మనకీ ఓ కారు కొనమని రోజూ అడుగుతున్నాను. అలాగయితేమేం ఎంచక్కా తొందరగా ఇంటికి వచ్చేయొచ్చు కదా అత్తయ్యా?'

'అంటే ఈ భూమ్మీద మరింత వాయు కాలుష్యం పెరిగిపోవడానికి నువ్వూ ఓ సమిధ వేస్తానంటావ్?' అంది అత్తయ్య నిట్టూరుస్తూ.

'కారు కొంటే సంతోషిస్తావనుకుంటే అలా అనేసావేంటత్తయ్యా,' అంది బుజ్జి స్కూలు బ్యాగును జాగ్రత్తగా బీరువాలో పెడుతూ.

'మీరు బడినుంచి వచ్చేటప్పుడు దారి పొడుగునా స్కూటర్లు, కార్లు, ఆటోలు మీతో పాటే వచ్చాయి కదా.. మరి వాటి పొగంతా మీ కళ్ళలోకి దూరినందుకేగా మీ కళ్లు మండుతున్నాయి. అలాంటప్పుడు మీ కారు వల్ల మరికాస్త పొగ పెరిగి వాయు కాలుష్యం ఎక్కువ కదూ?' అంది అత్తయ్య.

ఆనందంగా అత్తయ్య రుచిగా చేసిపెట్టిన బజ్జీలు తింటున్న నాని 'వాయుకాలుష్యం అంటే ఏమిటత్తయ్యా?' అన్నాడు.

నానికి వంత పాడుతున్నట్టుగా బుజ్జి అంది 'ఎందుకు కలుగుతుంది. దానివలన నష్టాలేమిటి?' అది లేకుండా ఉండాలంటే మనమేం చెయ్యాలి? అంటూ ప్రశ్నల వర్షం కురిపించేసింది.

అందుకే అత్తయ్యకి వీళ్ళంటే ఎంతో ఇష్టం. పిల్లలు అరమరికలు లేకుండా ప్రశ్నిస్తూంటేనే వాళ్లకి బాగా జ్ఞానం కలుగుతుందనేది అత్తయ్య సిద్ధాంతం మరి.

'అబ్బో వరసగా చాలా ప్రశ్నలే వేసారే? కానీ ఇప్పుడు మన సమాజం ముందున్న ప్రశ్నలేనర్రా ఇవన్నీను. పచ్చని చెట్లనుంచి వచ్చే స్వచ్ఛమైన గాలి, పరిశుభ్రమైన కమ్మటి నీరు, చెవికి ఇంపైన చక్కని శబ్దాలు ఇవన్నీ మనకి ప్రకృతి ప్రసాదించినవేనా కాదా?' అంది అత్తయ్య తను చెప్పబోయేదానికి ఉపోద్ఘాతంగా.

'వీటికి మాకళ్లు మండటానికి ఏమిటి సంబంధం?' అడిగాడు నాని.

అక్కడే ఉంది అసలు కిటుకు. వాతావరణంలో జీవులకి అవసరమైన ఆక్సిజన్ తక్కువైపోయి, అవసరం లేని కార్బన్‌డైఆక్సైడ్ ఎక్కువయిపోతే పర్యావరణం కలుషితం అయిపోయినట్టేనా కాదా? 'ఈనాటి నవనాగరిక ప్రపంచంలో అందరికీ వాహనాల మోజు పెరిగిపోయి అవసరం ఉన్నా లేకపోయినా వాటి వాడకం పెరిగిపోయింది కదా.. ఎడతెరి

పిలేని వాహనాలలో ఇంధనం సరిగ్గా మండక కార్బన్ మోనాక్సైడ్, కార్బన్‌డయాక్సైడ్ వంటి విషవాయువులు గాల్లో కలిసిపోతున్నాయి. వాహనాలనుండి వచ్చే కార్బన్ మోనాక్సైడ్ మన రక్తంలోని హీమోగ్లోబిన్‌తో కలిసి ఊపిరితిత్తులపై ప్రభావం చూపించడంవల్లనేగా ఇన్ని శ్వాసకోస జబ్బులు?'

'నిజమేలే. -- అయితే మరి మేమేం చెయ్యాలి?'

'కలపకోసం చెట్లను నరికేసే బదులు మన ప్రాణి కోటికి జీవాధారమైన అడవులను, చెట్లను పెంచాలి.'

'నువ్వలా ఎందుకన్నావో నాకు తెలుసులే అత్తయ్యా! చెట్లు వాతావరణంలోని కార్బన్ డై యాక్సైడ్‌ను పీల్చుకుని మనకి ఆక్సిజన్ వంటి ప్రాణవాయువునిస్తాయి అని మా టీచర్ క్లాసులో చెప్పారు. అందుకే ఇవాళ మా అందరిచేతా బడిలో తలో మొక్కా నాటించారు కూడా. 'వృక్ష సంపద మన భూమిని కాపాడుతుందట కదా!' అంది బుజ్జి.

అయితే వాయు కాలుష్యం నుంచి మన భూమిని కాపాడటానికి నీ వంతు కృషి చేసావన్నమాట. శభాష్ బుజ్జీ! అంటూ అత్తయ్య బుజ్జిని మెచ్చుకుంటున్నట్టుగా -- భుజం తట్టింది. నానికేసి మరి నువ్వేం చేస్తావన్నట్టు చూసింది.

బుగ్గమీద వేలుంచుకుని కాసేపు ఆలోచించి 'డాడీని కారు బదులు నాకో సైకిలు కొనివ్వమంటాను.' సైకిలయితే వాయు కాలుష్యం ఉండదుగా. అన్నాడు.

'తెలివైన ఆలోచనరా నానీ.. ఎందుకంటావా? పర్యావరణ పరిరక్షణలో నేను సైతం అంటూ నువ్వు కూడా పాలుపంచుకోవడం వల్ల నీకూ ప్రయోజనమేగా,' అంది అత్తయ్య మెచ్చుకోలుగా.

'అదెలా?' అంది బుజ్జి.

'వ్యాయామం చెయ్యడం వల్ల నీ తమ్ముడికి మంచి ఆరోగ్యం కూడా కదే బుజ్జీ!' అంది అత్తయ్య.

'అంతేనా? రోజూ సైకిల్ తొక్కితే నేను బుజ్జికంటే బాగా పొడుగు పెరుగుతాగా,' అంటూ ఆడుకోవడానికి బయటకు తుర్రుమన్నాడు నాని. వాడి తెలివితేటలకు, ఆలోచనకి అత్తయ్య బుజ్జి బాగా నవ్వుకున్నారు.



# కళా చికిత్స

ప్రియమైన చిన్నారులకు

కళ నయం చేయగలదని మీకు తెలుసా? చత్తీస్‌గర్‌లోని దంతేవాడకు చెందిన బాల బాలికలు చేసిన అద్భుత కృషిని ఈ నెల మీముందుకు తీసుకువస్తున్నాము. మీరు దీనిపై ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలని ఉంది. అలాగే మీ కళా కృషి గురించి మాకు తెలుపండి.

మీ దీదీ



సృజనాత్మక వ్యక్తీకరణ



ఆత్మవిశ్వాసాన్ని నెలకొల్పడం.



కదలిక

## కళల ఆధారంగా చికిత్సలు

అనేవి నోటి మాటల ద్వారా భావప్రసారం కష్టమవుతున్నట్లు లేదా భావప్రసారం అసాధ్యమైనట్లు కనుగొన్న పిల్లలకు ప్రత్యామ్నాయ చికిత్సా విధానంగా ఉంటున్నాయి.



కదలిక మరియు ఆట





పనితీరు

పథక ఉపకరణాలు మరియు టెక్నిక్‌లు

నాటకం మరియు పాత్రపోషణ

పిల్లలు కామిక్ వర్క్‌షాప్‌లో పాల్గొన్నారు. దీంట్లో వీరు బొమ్మలతో కూడిన కథను సృష్టించారు. దీన్ని తరగతి గదిలో ప్రదర్శించిన తర్వాత మొత్తం శిబిరం ముందు ప్రదర్శించారు.





సమర్పణ



బొమ్మ మరియు కామిక్ డిజైన్

ప్రదర్శన

కథ రూపకల్పన





గుర్తింపు

చిత్ర రూపకల్పన

సృజనాత్మక వ్యక్తీకరణ, తమ్ముతాము ప్రతిబింబించుకోవడం, ఆత్మవిశ్వాసాన్ని ప్రోది చేసుకోవడం కోసం పిల్లలు ఫొటోగ్రఫీ వర్క్‌షాప్‌లో పాల్గొన్నారు. వారికి కెమెరా పనిచేసే తీరు, లక్షణాల పరిచయం చేశారు. ఫొటోలు తీయడం, ఎడిటింగ్, తోటి విద్యార్థులతో పంచుకోవడం కోసం తమ స్వంత ఫొటో కథలను రూపొందించడానికి, పిల్లలకు తగు ప్రోత్సాహం అందించారు.







ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించడం.

కళా ప్రదర్శన

పిల్లలు కొత్త అనుభవాలను పంచుకోవడానికి తమ కళలను ప్రదర్శించడం ఒక మార్గం. దీని తర్వాత పిల్లలలో ఆత్మవిశ్వాసం, తమ పని విలువైనదన్న అనుభూతి ఏర్పడింది. ఇది చికిత్సా ప్రక్రియలో చాలా ముఖ్యమైన భాగం.



నాటక ప్రదర్శన



సమిష్టి కృషి మరియు తోటివిద్యార్థుల మద్దతు

పిల్లలు రూపొందించి, ప్రదర్శించిన కథలు






unicef

**Post your comments / queires to:**

CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com
http://www.facebook.com/unicefindia



# పిల్లిని చంపిన పాపము

పూర్వం ఒక గ్రామంలో గురవయ్య సెట్టి అనే కోమటి ఉండేవాడు. అతను చాలా తెలివైనవాడు. ఆ తెలివి అంతా ఉపయోగించి ఎంతో డబ్బు సంపాదించాడు. డబ్బు సంపాదనలో ఎన్నో మోసాలూ, అన్యాయాలూ చేస్తూ ఉండేవాడు.

పరులను అన్యాయం, మోసం చేస్తే పాపం వస్తుందని అతనికి తెలుసు. చేసిన పాపాలు పోగొట్టుకోడానికి కొందరు గుడి కట్టించడమో, ఓ చెరువు తవ్వించడమో, ఓ సత్రము వేయించడమో, ఇలాంటి పుణ్యకార్యాలేవో చేస్తూ ఉంటారు. కాని ఇవన్నీ డబ్బు ఖర్చయ్యే పనులే. ఇంత శ్రమపడి, పాపాలు చేసీ డబ్బు సంపాదించడం ఆఖరుకిలా ఖర్చు పెట్టడానికా? అనిపించేది గురవయ్యకి.

అంచేత అతను ఇలాటి ఖర్చయే పుణ్యకార్యాలేమీ తలపెట్టక, ఊరికే కనబడ్డ దేవుళ్లకీ, కొండలకీ, పుట్టలకీ, చెట్లకీ దణ్ణాలు పెడుతుండేవాడు. ఆ దణ్ణాలతో తన పాపమంతా పోయిందని అనుకునేవాడు.

ఒకనాడు సెట్టిభార్య పాలగిన్నె ఉట్టి మీద పెట్టడం మరిచిపోయింది. ఆవిడ వచ్చేలోపుగా పిల్లి ఒకటి వచ్చి ఆ పాలు తాగడం మొదలెట్టింది. సెట్టి పిల్లిని చూచి కోపంతో, దగ్గరున్న అరవీశె రాయి దాని మీద విసిరేశాడు. ఆ రాయి దానికి ఆయువుపట్టున తగిలి, అది గిలగిల తన్నుకు చచ్చింది!

ఏదో కోపంతో రాయి విసిరేశాడే కాని ఆ పిల్లి చస్తుందని గురవయ్య అనుకో

పి. సర్వమంగళ

లేదు. పిల్లి చచ్చిపోయిందనేసరికి అతడు గజగజ వణికి పోయాడు. ఏమంటే పిల్లిని చంపిన పాపం కాస్తా కూస్తా కాదు. ఆ పాపం వల్ల మళ్లీ జన్మలో కుష్ఠురోగం వస్తుందిట! ఇది చాలా పెద్దపాపం. గనక ఉత్తుత్తి దణ్ణాలతో పోయేది కాదని తోచి గురవయ్య ఆ ఊరి శాస్త్రులు గారితో ఆలోచించడానికి వెళ్లేడు.

ఎవరి విషయమో మాట్లాడుతున్నట్లు గురవయ్య ప్రసంగం మొదలెట్టేడు.

'శాస్త్రులుగారూ, పిల్లిని చంపితే పాపం అంటారు. నిజమేనా?'

'అందుకు సందేహమేమిటి? బ్రహ్మ హత్యాదోషం చుట్టుకుంటుంది.' అన్నాడు శాస్త్రులు.

'ఐతే ఈ పాపం పోవాలంటే ప్రాయశ్చిత్తమేమిటో?' అని అడిగాడు గురవయ్య.

'ప్రాయశ్చిత్తమా? ఆ చచ్చిన పిల్లి ఎంత ఉంటే అంత బరువుకి ఓ బంగారపు పిల్లిని చేయించి, బ్రాహ్మడికి దానం ఇస్తే పాపం పోతుంది.' అన్నాడు శాస్త్రుల్లు.

ఆ మాట వినేసరికి గుండె గుభేల్ మన్నది గురవయ్యకి. 'శాస్త్రుల్లు గారూ. ఐతే అందరికీ బంగారపు పిల్లుల్ని చేయించి ఇవ్వగల శక్తి ఉంటుందా? శక్తిలేని వాళ్ల మాటేమిటి?' అని అడిగాడు.

'అంత శక్తి లేకపోతే వెండితో చేయించి ఇవ్వవచ్చు,' అని ఉపాయం చెప్పాడు శాస్త్రులు.




'సరే కాని, వెండి మాత్రం చవగ్గా ఉందా శాస్త్రులు గారూ? మరి మార్గం లేదంటారా?' అని అడిగాడు గురవయ్య.

అందుకు శాస్త్రులు 'ఎందుకు లేదూ? మన పెద్దలు ఎక్కడి కక్కడే తాహతుకు సరిపడేటట్టు చెప్పేరు. వెండి పిల్లికి శక్తి లేని వాళ్లు కంచు పిల్లినో, ఆ శక్తీ లేనివాడు ఇత్తడి పిల్లినో చేయించవచ్చు,' అన్నాడు.

అక్కడికీ గురవయ్య వదలలేదు. 'ఆ శక్తీ లేకపోతే?' అని ప్రశ్న వేశాడు.

'అన్నింటిలోకీ కలిపి అతి స్వల్పమైన దానం స్వయంపాకం' అని తేల్చి చెప్పాడు శాస్త్రుల్లు.

స్వయంపాకం అంటే ఒక మనిషికి సరిపోయే బియ్యం, పప్పూ ఉప్పూ వగైరా



సామగ్రి. అన్నీ కలిపి అర్ధరూపాయికన్న ఎక్కువ ఖర్చవదు.

ఈ స్వల్పంతో తాను పిల్లిని చంపిన పాపం యావత్తూ పోగొట్టుకోవచ్చునని తెలుసుకున్నప్పుడు గురవయ్య చాలా సంతోషించాడు.

అప్పుడు శాస్త్రుల్లుతో ఆ పాపం చేసింది తానేనని వెల్లడించి, 'ఇంటికివెళ్లి స్వయం పాకం పంపిస్తాను. నా పాపం పోగొట్టండి?' అని కోరేడు.

శాస్త్రుల్లు నిర్ఘాంతపోయాడు. ఇతను బంగారపు పిల్లిబొమ్మ చేయించి దానం ఇవ్వగలిగినంత ధనవంతుడు. కాని స్వయంపాక దానంతో దాటేస్తున్నాడే! అనుకున్నాడు. మళ్లీ ఆలోచించి 'పోనీ, ఈ మాత్రం ఇచ్చే దాత ఎవడు. ఎక్కడి కక్కడే పుచ్చుకోవాలి' అని సిద్ధపడ్డాడు శాస్త్రులు.

గురవయ్య ఇంటివైపు మళ్లేసరికి అతని మనసు మళ్లీ వెనకదీసింది. అర్ధ మణుగు చింతపండు అమ్మితేనే గాని అర్ధరూపాయి రాదు. అలాంటి సొమ్ము ఖర్చు చేసి ఈ బ్రాహ్మడికి దానం ఇవ్వ డమా? అనిపించింది. ఈ ఖర్చు కూడా లేకుండా పాపం పోగొట్టుకోడానికి ఆలో చించాడు.

మళ్లీ శాస్త్రులు దగ్గరికి వచ్చి, 'ఏం బాబూ, నేను స్వయంపాకం మీకు ఇచ్చు కుంటే, నా పాపం నిజంగా పోతుందం టారా?' అని అడిగాడు.

అందుకు శాస్త్రుల్లు 'ఎందుకు పోదు? నీ పాపం నాకువస్తుంది. ఆ పాపం నేను జపం చేసి పోగొట్టుకుంటానులే అన్నాడు.'

ఇది విని గురవయ్య 'అట్టైతే సరే. నేనిలా పనిమీద వెడుతున్నాను. స్వయం పాకం తర్వాత పంపుతాను. మీరు జపం వెంటనే ఆరంభించండి,' అని తన దారిన బయలుదేరాడు.

మరోగంట పోయాక గురవయ్య మళ్లీ వచ్చి 'బాబూ, ఏం చేస్తున్నారు?' అన్నాడు.

'జపం చేస్తున్నాను' అన్నాడు శాస్త్రుల్లు.

'నేను ఇస్తానన్న స్వయంపాకం వల్ల మీకు వచ్చిన నా పాపం పోవటానికేనా బాబూ ఈ జపం? ' అని అడిగాడు

గురవయ్య. 'ఔను,' అన్నాడు శాస్త్తుల్లు.

సెట్టి, సంతోషంతో 'ఐతే పిల్లిని చంపిన పాపం తమకు వచ్చిందన్నమాటేనా!' అన్నాడు.

గురవయ్య ఇలా ఎందుకు అడుగుతున్నాడో బ్రాహ్మడికి తెలిసింది కాదు. సెట్టి చేసిన పాపం తనకు రాలేదంటే స్వయంపాకం ఎక్కడ పోతుందో అన్న భయంకొద్దీ 'అవును వచ్చింది' అని నోరారా అన్నాడు శాస్త్తుల్లు.

'మరైతే వస్తాను. సెలవు,' అంటూ గురవయ్య వెళ్లిపోబోయాడు. 'మరి నా స్వయంపాకం ఏదీ?' అన్నాడు శాస్త్తుల్లు.

'స్వయంపాకమా బాబూ? లాభాలు గూబల్లో కొచ్చాయి. మరొకప్పుడు ఇచ్చుకుంటా,' అన్నాడు గురవయ్య.

'అదేమిటోయ్ అలాగంటావు, ఇస్తానని మొదట చెప్పి?' అన్నాడు శాస్త్తుల్లు.

'ఇస్తానన్నమాట నిజమే బాబూ, కాని ఇవ్వలేను. ఏం చెయ్యను మరి? పిల్లిని చంపిన పాపం తమది. స్వయంపాకం ఇస్తానని ఎగ్గొట్టిన-పాపం నాది.' అంటూ గురవయ్య వెళ్లిపోయాడు.

పిల్లిని చంపిన పాపం చాలా ఎక్కువది. స్వయంపాకం ఇవ్వని పాపం చిన్నది. ఇది దేవునికో దణ్ణం పెడితే పోతుంది, అనుకుని గురవయ్య దారిలో గుడి కనిపిస్తే, ఆగి చెప్పుల జోడులోంచి కాళ్లు తీసి, దేవునికో దణ్ణం పెట్టి, లెంపలు వాయించుకుని, కానీ ఖర్చులేకుండా పాపమంతా పోయిందని సంతోషిస్తూ ఇంటికి వెళ్లిపోయాడు.

సంతోషించి వెళ్లాడే కాని పిల్లిని చంపిన పాపం ఎలాగూ పోలేదు సరికదా, బ్రాహ్మణ్ణి ఆశపెట్టి స్వయంపాకం ఇవ్వకుండా పోయినందుకు ఆ పాపం కూడా వచ్చి చుట్టుకుందన్న సంగతి తెలుసుకోలేకపోయాడు.





# అసలు దొంగలు

వంగరాజ్యాన్ని వైశాలిపురం రాజధానిగా చేసుకుని పరిపాలిస్తున్నాడు మార్తాండవర్మ. వంగరాజ్యం పరిస్థితులు ఏమాత్రం బాగా లేవు. దానికి కారణం మార్తాండ వర్మే. రాజు స్వతహాగా మంచివాడేగానీ, జల్సాలు ఎక్కువ. రాజ్యభారం అంతా మంత్రులు, సామంతులూ, ఉద్యోగులే చూసుకుంటారు. రాజ్యంలోని ఏ విషయమూ ఆయనకు తెలియనివ్వకుండా ఆయన విందు వినోదాలతో మునిగితేలేలా చూస్తున్నారు.

మహారాజు విలాసాలకీ, ఖజానా నిర్వహణకీ, తమ తమ ఆడంబరాలకీ అందరూ ఒక్కటైపోయి ప్రజల్ని పీల్చి పిప్పి చేసి పన్నులు వసూలు చేస్తున్నారు. పన్నులు కట్టలేకపోతున్న వాళ్లమీద కనికరం లేకుండా చెరసాలలో వేస్తున్నారు. ఒకరోజు కాపలాదారుల కళ్లు గప్పి మార్తాండవర్మ అంతరంగిక మందిరంలో దూరి దొంగతనానికి పాల్పడ్డాడు ఒక యువకుడు. అలికిడికి నిద్రలేచిన మార్తాండవర్మ స్వయంగా ఆ యువకుడిని బంధించాడు. 'ఎవరు నీవు? ఎంత ధైర్యం నీకు? సాక్షాత్తూ మహారాజు మందిరంలోనే దొంగతనానికి వస్తావా?' అన్నాడు మార్తాండవర్మ.

ఆ యువకుడు ఏమీ మాట్లాడలేదు. 'మాట్లాడకపోతే నేరం అంగీకరించినట్లే భావించబడుతుంది' అన్నాడు రాజు. అప్పటికీ అతడు నోరు విప్పలేదు. 'అంతఃపురం లోకి అనుమతి లేకుండా అర్ధరాత్రి ప్రవేశిస్తే శిక్ష ఏమిటో తెలుసా? ఉరిశిక్ష.' అని రాజు గర్జించినా అతడు బదులు పలకలేదు.

'సరే నీ మొండితనం వదిలేలా లేవు నువ్వు. అర్ధరాత్రి అనుమతి లేకుండా, రాజాంతఃపురంలో దూరినందుకు నీకు ఉరిశిక్ష విధిస్తున్నాను. ఉరిశిక్షపడిన ఖైదీగా నీకు ఆఖరి కోరిక ఏదైనా ఉంటే తీర్చుతాము. ఏదైనా ఉంటే చెప్పు. ఇప్పుడు కూడా నోరు తెరువకపోతే నీ ఇష్టం. తెల్లవారితే నీకు శిక్ష అమలు జరుగుతుంది.' అప్పుడతడు నోరు తెరిచి 'ఉంది మహారాజా.

కలిగినీడి లక్ష్మి వాసుకి

నాకు ఆఖరి కోరికి ఒకటుంది. తీరుస్తారా' అన్నాడు. 'తప్పకుండా,' మాటిచ్చాడు మార్తాం డవర్మ.

'నా పేరు విజయుడు. మాది సిరిపురం. నా తల్లిదండ్రులిద్దరికీ ప్రమాదవశాత్తూ కళ్లు పోయాయి. వాళ్లు ఎక్కడికీ వెళ్లలేరు. మీరు స్వయంగా నా స్థానంలో వెళ్లి మా ఇంట్లో రెండు రోజులుండాలి. ఇదే నా ఆఖరి కోరిక,' అన్నాడు విజయుడు.

విజయుడి ఆఖరి కోరిక ప్రకారం మారు వేషంలో సిరిపురం వెళ్లాడు. విజయుడికి శిక్ష వారం రోజులు వాయిదా వేసి, అతడిని చెర సాలలో ఉంచాడు. సిరిపురంలో అడుగుపెట్ట గానే ఆశ్చర్యపోయాడు మార్తాండవర్మ. తన రాజ్యంలో భాగంలా అనిపించలేదు. కరువు పీడిత ప్రాంతంలా ఉంది. ప్రజలు జీవచ్ఛవాల్లా ఉన్నారు. పంటపొలాలు ఎండిపోయి, పశు వులు అస్థిపంజరాల వలె తిరుగుతున్నాయి.

ఇక విజయుడి ఇంట్లో పరిస్థితి మరీ ఘోరం. ఇంట్లో తిండి గింజ లేదు. ఊళ్లో దొరకే పరిస్థితి లేదు. పనులూ లేవు. విజయుడు ఏ పరిస్థితుల్లో దొంగతనానికి వచ్చాడో, తనని ఈ ఊరు వెళ్లమని ఆఖరి కోరికగా ఎందుకు కోరాడో అర్థమైంది మార్తాండవర్మకి.

వెంటనే వైశాలిపురం తిరిగి వెళ్లి విజయు డిని బయటకు తీసుకువచ్చాడు. అవినీతికి పాల్పడిన అందరినీ విధులనుంచి తొలగించి చెరసాలలో వేయించాడు. విజయుడిలాంటి యువకులని ఆ స్థానాల్లో నియమించాడు. విజయుడిని మంత్రిని చేశాడు. తన విలాసాలు వదులుకుని ప్రజల సొమ్ముని ప్రజల సంక్షేమం కోసమే ఖర్చు చేయడం మొదలు పెట్టాడు.

'సరైన సమయంలో నా కళ్లని తెరిపించి వాస్తవాలని నా కళ్లముందు ఉంచినందుకు నీకు నేనూ, నా ప్రజలూ ఎప్పటికీ రుణపడి ఉంటాము విజయా,' అన్నాడు మార్తాండ వర్మ విజయుడితో. విజయుడు చిరునవ్వు నవ్వాడు. 'నిజానికి నేను దొంగతనానికి రాలేదు మహారాజా, అలా చేసి ఆఖరి కోరికగా అడి గితే తప్ప మీరు నా కోరిక అంగీకరించరని నాకు అనిపించి అలా చేశాను. అంతే,' అన్నాడు.

మెచ్చుకోలుగా అతని భుజం తట్టాడు మార్తాండవర్మ. 'మంత్రిగా పనిచేసేటందుకు నీకు అన్ని అర్హతలూ ఉన్నాయి. నువ్వు దొంగగా మారి అసలు దొంగల్ని పట్టించడంలోనే ఉన్నాయి నీ తెలివితేటలన్నీ,' అన్నాడు నవ్వుతూ.





# వికటమైన నవ్వు

చాలాకాలం కిందట, భద్రాచలం అడవులలో దారిపక్కనే ఒక ఆశ్రమం ఉండేది. ఆ ఆశ్రమంలో ఒక యోగి పుంగవుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఆయన మంచి దృఢ శరీరం కలవాడు. నిగనిగలాడే నల్లటి మూరెడు గెడ్డం కలవాడు. ఆ మహానుభావుడి దర్శనం చేసే సరికి ఎవళ్లకైనా సరే, చెయ్యెత్తి మొక్కుదామనిపించేది.

ఆ యోగీశ్వరుడు ఈ అరణ్యంలోకి ఎప్పుడు వచ్చాడో, ఎలా వచ్చాడో, ఈ ఆశ్రమం ఎలా స్థాపించాడో, పిట్టకైనా గుట్టు తెలియదు. తెలియకపోవటం చేత లోకులు తలకొక మాటగా చెప్పుకునేవారు. ఎవరేమనుకున్నా, ఆయన లోకం ఉద్ధరించడానికి విచ్చేసిన మహానుభావుడని మాత్రం అందరూ నమ్మారు. తరణోపాయం కోసం ఆయనను ఆశ్రయింపజూశారు.

ఐతే, ఆ యోగి పుంగవుడు ఎవరితోనూ మాటాడడు. ఆయన మౌనవ్రతుడు. ఆశ్రమంలో ఎత్తయిన మండపం మీద పద్మాసనం వేసుకుని కూర్చుని ఉంటాడు. ఆయనకు ఈ ప్రపంచంతో సంబంధమే లేదా అనే అనిపిస్తుంది చూసేవాళ్లకు. అందుచేత, వచ్చేపోయేవాళ్లంతా తమకు తోచిన తృణమో, ఫణమో భక్తిపూర్వకంగా మండపం మీద ఉంచి, స్వామికి ఒక్కసారి మొక్కి మరీ పోతూ ఉండేవారు.

ఈ విధంగా, దోపిడి దొంగలతో నిండి ఉన్న ఆ మహారణ్యంలో ఆ యోగీశ్వరుడి మూలాన జన సంచారం రోజురోజుకీ

వి. లావణ్య

ఎక్కువ కాజొచ్చింది. దీని ఫలితంగా అరణ్య ప్రాంతంలో దోపిడీలూ, దొంగత నాలూ తగ్గిపోవలిసింది. కాని, అలాంటి దేమీ కనిపించలేదు సరికదా, అంతకం తకు చోరీలు మరీ ఎక్కువవుతూ వచ్చినై.

ఒకనాటి రాత్రి పదకొండు గంటలకు ఆ మార్గాన ఒక బండి పోతున్నది. ఆ బండిలో ముగ్గురు స్త్రీలూ, ఇద్దరు పురుషులూ, ఒక పిల్లవాడూ ఉన్నారు. ఆ స్త్రీల వంటి నిండా ఆభరణాలున్నవి. హఠాత్తుగా ఒక దొంగల నాయకుడు బండిని అటకాయించాడు. వాడి తలగుడ్డ, మెరిసే కనుగుడ్లూ, కోరమీసాలూ, చేత దుడ్డుకర్ర -- ఈ వేషం చూస్తే బండిలో వాళ్లకు పై ప్రాణాలు పైనే ఎగిరిపోయే టంత హడలు పుట్టింది. ఒక్కళ్లకూ నోటమాట పెగలలేదు.

దొంగల నాయకుడు దుడ్డుకర్రతో నేల మీద టక్ టక్ మని కొడుతూ, వాళ్లను సమీపించి, 'నా మాటలు జాగ్రత్తగా వినండి. నేను వృత్తి చేత దొంగనే. ఐనా, నాదంతా ఒక పద్ధతి. నాకు కావలసింది మీ ధనం అంతే, ప్రాణాలు కాదు. మాటాడక, నగా నట్రా తీసి ఇక్కడ పెట్టి వేశారంటే మీకేమీ భయం ఉండదు. కాదూ కూడదూ అని, మీరు ఎదురు తిరిగినా, గోల చేసినా, అదుకో ఆ పొదల చాటున ఉన్న నా జట్టు వాళ్లు చూశారా, ఆ పదిమందీ వచ్చేసి, చేయవలసిన పని



అంతా చేసిపోతారు. ఒక్కసారి వాళ్లకి సంజ్ఞ చేశానో, మరి చూసుకోండి' అని హెచ్చరించాడు.

బండిలో వాళ్లు ఒకసారి ఆ దొంగల నాయకుడు చూపిన పొదవైపు చూశారు. అందులో భయంకరమైన తలలు కనిపించేసరికల్లా వాళ్లకు గుండె ఆగిపోయినంత పని జరిగింది. చేసేది లేక పురుషులు తలలు వంచుకున్నారు. స్త్రీలు తమ నగలన్నీ ఒలిచి నాయకుడి ఎదుట పెట్టారు. అప్పుడు నాయకుడు వారిని 'ఇకవెళ్లండి,' అని హెచ్చరించి ఆ ధనం పట్టుకుని అక్కడ నుంచి మాయమయ్యాడు.

తరువాత మరి కొంత సేపటికి అదే దారిని ఒక వర్తకుడు కాలినడకన వస్తు




న్నాడు. యథాప్రకారం దొంగల నాయకుడు అతడికి అడ్డం వెళ్లి, 'డబ్బా, లేకుంటే నీ ప్రాణం!' అని బెదిరించాడు. ఆ వర్తకుడు చాలా మొండివాడూ, యుక్తి పరుడున్నూ. వాడు దొంగ మాటలకు బదులుగా, 'ఉన్నది నా వద్ద కొంచెం డబ్బు. ఐతే, అది నాది కాదు,' అన్నాడు నదురూ బెదురూ లేకుండా.

దొంగల నాయకుడు వినిపించుకో లేదు. అప్పుడు వర్తకుడు తన దగ్గిర ఉన్న డబ్బు నాయకుడి చేతులలో పెడుతూ, 'పొదల మాటున ఉన్న పెద్ద మనుషుల్లారా! మీ నాయకుడి చేతికి వెయ్యి వరహాలు ఇచ్చాను. మీరు దగా పడక మీమీ వంతులు గుంజుకోండి.' అంటూ కేక పెట్టాడు. ఇలా అరిచిన వర్తకుడికి నాయకుడు దుడ్డుకర్రతో రెండు ఇచ్చాడు. దెబ్బతో వర్తకుడు పారి పోయి, అరణ్యం దాటి ఒక సత్రం చేరు కున్నాడు.

అక్కడ సత్రంలో ఆ సమయాన రాజ భటులూ, దండనాయకుడూ విడిసి ఉన్నారు. వర్తకుడు వాళ్లతో తన సంగతి వెళ్ల బోసుకున్నాడు. అప్పుడు రాజ భటులు అతనితో 'వాడెక్కడో మాకు చూపవయ్యా, నిమిషంలో పట్టేస్తాం,' అన్నారు.

అంతా కలిసి, దొంగలుండే ఆ ప్రాంతా నికి చేరుకున్నారు. రాజ భటులు ఒక చోట దాగి ఉన్నారు. వర్తకుడు ముందు నడుస్తూ, అతని వెంట దండనాయకుణ్ణి మాత్రం తీసుకువెళ్లాడు. ఇద్దరే రావడం గమనించి. దొంగల నాయకుడు వాళ్లను అటకాయించడానికి -- ముందుకు వచ్చాడు. 'డబ్బా! లేదా ప్రాణం! అదుగో, చూశారు కదా పొదల మాటున మా పటాలం!' అన్నాడు. దుడ్డుకర్రతో నేల మీద టకటకమని కొడుతూ.

దండనాయకుడు కత్తిసాము, గరిడీలు నేర్చిన మొనగాడు. వెంటనే ఈల వేసి, దొంగల నాయకుడి పైన కలియ బడ్డాడు. వాడిని కింద పడగొట్టి, ఉడుం పట్టు బాగా గట్టిగా పట్టి ఉంచి, 'వీడి పని నే చూస్తా, మీరు పోయి, ఆ పొదలమా

టున పొంచి ఉన్న వీడి ముఠావాళ్ల పని పట్టండి!' అని భటులకు ఆజ్ఞాపించాడు.

రాజభటులు ఉరకలేసుకుంటూ, పొదలమాటున పొంచి ఉన్న దొంగల ముఠా మీదికి వెళ్లారు. వాళ్లలో ఒక్కడూ కదలలేదు.. మెదలలేదు. ఎదుర్కో లేదు. తప్పించుకోబోలేదు. రాజభటులు వాళ్లను కర్రలతో కొట్టినా ఎక్కడివాళ్లు అక్కడనే ఉండిపోయారు!

ఇదేమిటా అని పరిశీలించి చూస్తే, ఆ మనుషులుగా కనబడే వాళ్లంతా వట్టి గడ్డి బొమ్మలు! తలకాయలకు మాత్రం మను షులకు లాగానే పెద్ద పాగాలు చుట్టి ఉన్నాయి. దొంగల నాయకుడి తెలివికి అందరూ ఆశ్చర్యపోయారు.

యోగీశ్వరుడి ఆశ్రమం అక్కడికి దగ్గర లోనే ఉన్నది కనుక, రాత్రికి ఆశ్రమంలో కాలక్షేపం చేద్దామనుకుని అంతా వెళ్లారు. చూడబోతే అక్కడ స్వామి లేడు.

దండనాయకుడి ఆజ్ఞ ప్రకారం భటు లందరూ పోయి ఆశ్రమంలో రకరకాల దొంగ సొమ్ములు కొల్లలుగా కనిపించినై. అవన్నీ వాళ్లు చిక్కించుకున్నారు. తరవాత ఇంకా బాగ వెతికేసరికి, నిగనిగలాడే మూరెడు నల్లటి గెడ్డం ఒక గోడకు వేలాడుతూ కనబడింది. అందరూ దానిని వింతగా చూడసాగారు.

అప్పుడు చేతులు బంధించబడి ఉన్న దొంగల నాయకుడు వాళ్లనుద్దేశించి, "ఏమిటయ్యా, వింతగా చూస్తున్నారు? అది నాపగటి వేషం. ఆ వేషంలోనే నేను మౌనం దాల్చి ఉండగా, భయంతో నన్ను పూజించి కానుకలర్పిస్తున్నారు మీరు. ఇది నా రాత్రి వేషం. ఇప్పుడీ విధంగా సత్కరి స్తున్నారు. ఎన్నాళ్లు మోసగించినా ఒకరోజు పట్టుబడక తప్పదు కదా! సరే కానీండి. ఇది కాకపోతే, మరో నాటకం! మరొక వేషం!' అంటూ వికటమైన నవ్వు నవ్వాడు.





# వాలి-దుందుభి

పూర్వకాలమందు దుందుభి అనే రాక్షసుడు ఉండేవాడు. వానిది ఎనుబోతు స్వరూపము. దుందుబికి దెబ్బలాట అంటే సరదా. అందుచేత, ఎల్లప్పుడూ ఎవరితో కయ్యానికి కాలు దువ్వటమూ అని ఆలోచిస్తూ ఉండేవాడు.

ఒకనాడు వాడు సముద్రుని వద్దకు పోయి, 'సాగర మహారాజా! పంచభూతాలలోనూ ఒకడవైన నీవు మహాగంభీరుడవని గర్విస్తూ ఉంటావే! నిజంగా నీవు వీరుడవైతే నాతో యుద్ధం చేసి నన్ను జయించు చూద్దాం,' అంటూ సవాలు చేశాడు.

అందుకు సముద్రుడు 'నీతో యుద్ధం చేయటానికి నాకు తీరికలేదు. తగిన సామర్థ్యమూ లేదు. హిమవంతుని వద్దకు వెళ్లావంటే నీ కోరిక తీరుతుంది' అని చెప్పాడు. దుందుభి వెంటనే హిమవంతుని దగ్గరకు పోయి నోటిమాటలతో యుద్ధానికి రమ్మనటం వీరలక్షణం కాదని తలిచి కొమ్ములతో శిఖరాలను పొడవజొచ్చాడు.

కొన శిఖరం మీద ఉన్న హిమవంతుడు ఇది చూచి, 'ఎందుకయ్యా ఇలా నన్ను కొమ్ములతో కుమ్ముతున్నావు? నీ ఉద్దేశం ఏమిటి?' అని అడిగేసరికి, 'నీవు మహావీరుడవని సముద్రుడు చెప్పాడు. పౌరుషముంటే నాతో యుద్ధం చేసి గెలువమం'టూ తొడ కొట్టాడు దుందుభి.

అప్పుడు.. హిమవంతుడు వానితో 'అయ్యో సముద్రుడు పొరపడ్డాడు. నేను వీరుడనన్న మాట నిజమే. కాని

డి. పద్మావతి

నిన్ను ఎదిరించలేను. తారతమ్యం తెలుసుకోకుండా దుడుంగుమని గాలం వేసే వాణ్ణి కాను నేను. ఇంతకూ నీతో యుద్ధం చేస్తూ కూచోటానికి నాకు తీరిక లేదు. ఏమీ అంటే-- అనేకమంది మునులు నా సాన్నిధ్యాన్ని చేరి నన్ను ఆనందింపజేస్తూ ఉంటారు. వారు శాంతిప్రియులు. వారికి ఇటువంటి యుద్ధాలు గిట్టవు.' అన్నాడు.



అప్పుడు దుందుభి 'ఏమిటయ్యా హిమవంతుడా! నీళ్లు నములుతావేం? ఇప్పుడు నేను ఎవరో ఒక వీరుణ్ణి-- యుద్ధంలో జయించిగాని ఇంటికి వెళ్లను,' అని భీష్మించాడు.

వాని ఉత్సాహం గమనించిన హిమవంతుడు, 'ఓయి వీరుడా! వానర చక్రవర్తి ఐనటువంటి వాలిని ఎరుగుదువు కదా? అతనికి సాటి వీరులు ముల్లోకాలలోనూ లేరు. నీవు పోయి అతన్ని పిలిచావంటే నీ సరదా తీరుతుంది.' అనేసరికి, 'సరే నాయనా! నీవు యుద్ధం చేయకపోతే పోయావ్. మరొకణ్ణి చూపించావు. అదే పదివేలు,' అని సంతోషిస్తూ, దుందుభి వాలి ఉండే కిష్కింధపురి చేరుకున్నాడు.

దుందుభి అక్కడికి చేరుకునేసరికి అర్ధరాత్రి కావటం చేత వాలి మంచి గాఢ నిద్రలో ఉన్నాడు. ఉరుములవంటి అరుపులతో దుందుభి అల్లరి చేయగా వాలికి మెలకువ వచ్చి, 'ఓయి దుందుభీ! నీ సంగతి నాకు తెలుసు. అర్ధరాత్రి వేళ వచ్చి ఎందుకిట్లా బొబ్బలు పెడతావు? పోపో. ప్రథమ తప్పిదంగా నిన్ను క్షమించి విడిచిపెడుతున్నాను,' అన్నాడు.

దుందుభి నవ్వుతూ, 'నీవు నన్ను ప్రథమ తప్పిదంగా విడిచి పెట్టనక్కర లేదు. నిన్ను యుద్ధంలో జయించటానికే ఇప్పుడు నేను వచ్చాను. కనుక, నీకిదే ఆఖరు రాత్రి. ఈ రాత్రి అంతఃపురంలో హాయిగా నిద్రించి, రేపటి రోజున నాతో పోరు సల్పటానికి సిద్ధంగా ఉండవలసింది. మళ్లీ పొద్దున్నే వస్తాను.' అంటూ గర్జించి వెళ్లిపోయాడు.

ఉదయాన్నే వచ్చి దుందుభి మళ్లీ సింహనాదం చేశాడు. అప్పుడు వాలి

దుందుభితో 'ఏమిరా నీకింకా జ్ఞానం కలగలేదా? నాతో యుద్ధానికే నిశ్చయిం చుకున్నావా? నీతో యుద్ధం చేయడం నావంటి వానికి చాలా గౌరవం తక్కువ. ఐనా నీ పీడ తొలగించడం. లోకానికి క్షేమ కరమనే ఉద్దేశంతో ఒప్పుకుంటున్నాను,' అని చెబుతూ ఒక్కక్షణంలో యుద్ధానికి సిద్ధమై వచ్చాడు.

తక్షణమే ఇద్దరూ కలియబడ్డారు. కాని దుందుభి చావటానికి, వాడు ఉత్సా హపడినంత సేపయినా పట్టలేదు.

వాలి విజయగర్వంతో జయజయ ధ్వానం చేసుకుంటూ దుందుభి కళేబ రాన్ని బలం కొద్దీకాలితో ఎగురదన్నాడు.

ఆ కళేబరం సరాసరి పోయి మతంగ మహర్షి ఉండే రుష్యమూక పర్వతంపైన పడింది. దుందుభి ముక్కులనుండీ నోటినుండీ వచ్చే రక్తధారలతో ఆ పర్వత మంతా తడిసిపోయింది.

ఇదంతా దివ్యదృష్టి వలన తెలిసికొన్న మతంగ మహర్షి కోపగించి, 'ఇటువంటి అకార్యం చేసిన వాలి ఎప్పుడైనా ఈ పర్వతం మీదికి వచ్చినట్లయితే తలపగిలి చస్తాడ'ని శపించాడు.

ఈ సంగతి భటుల వలన విని వాలి వెంటనే మతంగుని వద్దకు వెళ్లి 'మహా నుభావా! తెలియక చేశాను-- తప్పు, క్షమించండి,' అని బతిమాలాడు. కాని అందుకు రుషి 'ఓరి అబ్బాయీ! నిప్పు తెలిసి తాకినా కాలుతుంది, తెలియక తాకినా కాలుతుంది. నా మాటకు తిరు గులేదు. అనుభవించవలసిందే, పో!' అని చెప్పి పంపించివేశాడు.

ఆ శాపభయం వల్ల వాలి తన జీవి తంలో మరెన్నడూ రుష్యమూకానికి పోనే లేదట. ఎంతటి వీరుడూ, శూరుడూ ధైర్యశాలి ఐనా, వాలివంటి వాడు సైతం రుషి శాపానికి లొంగిపోవలసి వచ్చింది.



# కెరీర్ అంటే?



ఇండియన్ ఫారిన్ సర్వీస్: ఇండియన్ ఫారిన్ సర్వీస్ కేంద్ర సర్వీసులలో ఒకటి. ఇది మన దేశానికి చెందిన కీలకమైన దౌత్య సేవా విభాగం. ఈ విభాగం సభ్యులైనవారు అంతర్జాతీయ రంగంలో దేశానికి ప్రాతినిధ్యం వహిస్తుంటారు. ఈ విభాగం అధికారులు విభిన్న రాజకీయ, సామాజిక, జాతపరమైన, సాంస్కృతిక అంశాల్లో విశేష అనుభవం కలిగి ఉంటారు. ఐ.ఎఫ్.ఎస్ అధికారులు విదేశాల్లోని 160కి పైగా భారతీయ రాయబార కార్యాలయాలలో నియమించబడతారు. వీరు ఐక్యరాజ్యసమితి, యునెస్కో, ప్రపంచ బ్యాంకు, సార్క్, తదితర సంస్థలలో కూడా నియమించబడతారు. స్వదేశంలో వీరు పాస్‌పోర్ట్ అధికారులుగా దేశంలోని వివిధ ప్రాంతాలలో నియమించబడతారు.

ఇండియన్ రెవెన్యూ సర్వీస్ (ఐ.ఆర్.ఎస్): ఈ విభాగం ఆదాయ పన్నుకు సంబంధించిన వ్యవహారాలను నిర్వహిస్తుంది. ఈ విభాగం సభ్యులు ఆదాయపన్ను శాఖలో అసిస్టెంట్ కమిషనర్లుగా తమ కెరీర్ ప్రారంభించి ఈ శాఖలో ఛీఫ్ కమిషనర్ స్థాయికి ఎదుగుతుంటారు.



ఇండియన్ కస్టమ్ అండ్ సెంట్రల్ ఎక్సైజ్ సర్వీస్: ఈ విభాగంలోని సభ్యులు కస్టమ్స్ మరియు కేంద్ర ఎక్సైజ్ శాఖలను నిర్వహిస్తారు. కస్టమ్స్ విభాగంలో ఛీఫ్ కలెక్టర్ స్థాయికి వీరు ఎదుగుతుంటారు.

ఇతర సేవలు: ఇండియన్ రైల్వే సర్వీసెస్, ఇండియన్ పోస్టల్ సర్వీస్, ఇండియన్ ఇన్ఫర్మేషన్ సర్వీస్ వంటి కేంద్ర సర్వీసులు కూడా ఉన్నాయి. ఇవి విభిన్న రంగాలలో పనులు నిర్వహిస్తుంటాయి.

అర్హత: ఇరవై ఒకటి నుంచి ముప్పై ఏళ్ల వయసు కలిగి బ్యాచిలర్ డిగ్రీ పూర్తి చేసుకున్న ఏ భారతీయ పౌరుడయినా సరే ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షలకు హాజరు కావచ్చు.

(ఇంకా ఉంది)

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 29

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -29 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జూలై నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. సెప్టెంబర్ 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## నాడీ వ్యవస్థ



1. శరీరంలోని వివిధ భాగాల మధ్య చర్యలను మరియు సరఫరా సంకేతాలను సమన్వయించే కణాలను పేర్కొనండి.
2. నాడీ వ్యవస్థలోని రెండు రకాల సంకేతాలు ఏవి?
3. నాడీ వ్యవస్థ మొత్తానికి ప్రధాన కేంద్రమేది?
4. నాడీ వ్యవస్థలో ఎన్ని నాడీ కణాలున్నాయి?
5. మూడు సంరక్షక నాడుల పేర్లు ఏమిటి?
6. మెదడు లోని భాగాలను పేర్కొనండి?
7. మానవులలో మేధస్సుకు కారణమైన మెదడులోని భాగమేది?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-26 మార్చి 2011 సమాధానాలు

1. నామ్‌ధారి సిక్కులు 2. కాశ్మీర్ 3. దామోదర్ మరియు హుగ్లీ 4. ఆర్యభట్ట 1 5. పాక్షి 6. కుమర్తులి లేదా కుమ్మరి గ్రామం.

మార్చి '11 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.



# నవ్వుల పువ్వులు



నరేంద్ర: డాక్టర్ గారూ, నా ఎడమకాలు నొప్పి పెడుతోందండి.
డాక్టర్ : అలాగా! దీనికి చికిత్సలేదు. ముసలితనం కారణంగా ఇది వస్తుంటుంది.
నరేంద్ర: మీరు పొరపడుతున్నారు డాక్టర్, నా కుడి కాలు కూడా ఎడమకాలిలాగా ముసలిదే కదా, కాని అది నొప్పి అంటూ ఎరగదు మరి.



రాజేష్: మా అత్తయ్య ఈరోజు ఇరవై అంతస్తుల భవనం మీద నుంచి దుమికింది.
రాణి: ఏం మాట్లాడుతున్నావు నువ్వు? మన పట్టణంలో ఎక్కడా అన్ని అంతస్తులుండే భవంతులు లేవు తెలుసా?
రాజేష్: అవునా, ఆమె పదంతస్తుల భవంతి మీద నుంచి రెండుసార్లు దూకిందిలే.
రాణి: ??????



అరుణ్: వైశాలీ, మన హోమ్‌వర్క్ లో సాయం చేయమని తాతయ్యను అడిగావా?
వైశాలి: అవును అడిగాను.
అరుణ్: తాతయ్య ఏమన్నాడు?
వైశాలి: హోమ్‌వర్క్ అన్నది ఇంట్లో ఉన్నప్పుడే చేస్తారు. నేనిప్పుడు ఇంటి బయట కూర్చొని ఉన్నాను' అన్నాడు.



అమ్మ: సంగీతం క్లాస్ ఎలా ఉంది?
కొడుకు: చాలా బాగుంది. మా టీచర్ చాలా భక్తిపరురాలు
అమ్మ: నీకెలా తెలుసు.
కొడుకు: నేను గిటార్ వాయించినప్పుడల్లా ఆమె పెద్దగా కేక పెడుతుంది. 'ఓరి దేవుడా, ఓరి దేవుడా!'

రాజ ఫలహారం

# ఐస్‌క్రీమ్ చరిత్ర



ప్రాచీన నాగరికతలలో భోజనానంతర తీపి వంటకంలో ఐస్‌ని ఉపయోగించేవారు. మెసపొటేమియాలో 4 వేల సంవత్సరాల క్రితమే మంచు గృహాలు ఉండేవి. సుగంధ పానీయాలు, ఐస్ తయారు చేయడానికి చైనీయులు ఒక పరికరం కనిపెట్టారని భావించేవారు. 13వ శతాబ్దంలో, మార్కోపోలో చైనా నుండి ఐస్‌క్రీమ్ వంటకాలను వెంటబెట్టుకుని ఇటలీకి ప్రయాణమయ్యాడు.





ఆశ్చర్యం! వైద్యశాస్త్ర పితామహుడు హిప్పోక్రాట్స్ తన రోగులను ఐస్‌క్రీమ్ తినమని ప్రోత్సహించేవాడు. 'ఎందుకంటే ఐస్‌క్రీమ్ జీవరసాలను ఉత్తేజపరిచి ఆరోగ్యాన్ని పెంచుతుంది'. త్రీ ఛీర్స్ టు హిప్పోక్రేట్స్!

క్రీ.పూ 5వ సంవత్సరంలో, గ్రీకులు తేనె, పండ్లు నింపిన ఐస్‌ని ఏథెన్స్ అంగళ్లలో అమ్మేవారు. ఐస్ అంటే నాటి చక్రవర్తులకు చాలా యిష్టం. జగజ్జేత అలెగ్జాండర్, నీరో తమ సేవకులను పంపి పర్వతాలనుండి ఐస్‌ని సేకరించేవారు. దాన్ని వీరు కందకాలలో, గదుల్లో పెట్టి నిల్వ చేసేవారు. అలెగ్జాండర్ ఐస్‌లో తేనె కలుపుకుని ఆరగించేవాడు. నీరో చక్రవర్తి ఐస్‌లో పళ్లముక్కలను కలిపి తీసుకునేవాడు.





16, 17 శతాబ్దాలలో ఐస్‌క్రీమ్‌లు పాల ఉత్పత్తుల స్థాయికి చేరుకున్నాయి. ఇంగ్లండ్ రాజు చార్లెస్ ఐస్‌క్రీమ్ వంటకాన్ని అతి రహస్యంగా ఉంచేందుకు తన వంటమనిషికి ప్రోత్సాహకాన్ని ఇచ్చేవాడు. ఛార్లెస్ మరణం తర్వాత ఆ వంటమనిషి తన నోరు విప్పాడు. అప్పటినుంచి ఐస్‌క్రీమ్ వంటకం ఇక రహస్యంగా లేదు!

భారత దేశంలో కుల్ఫీ వంటకానికి చాలా ప్రత్యేకత ఉంది. నూర్జహాన్ హిమాలయాల్లోని గడ్డ కట్టిన సరస్సులనుంచి ఐస్‌ని తరలించి దాన్ని ప్రత్యేక గదుల్లో నిల్వ చేయించేదని తెలిస్తోంది. మంచుముక్కలను పగులకొట్టి దానికి చక్కెర కలిపిన పాలు, పండ్లముక్కలు కలిపి చేసిన వంటకాన్ని నూర్జహాన్, జహంగీర్ చక్కగా ఆరగించేవారట.





అమెరికా అధ్యక్షులు జార్జి వాషింగ్టన్, థామస్ జెఫర్సన్, ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్ ఐస్‌క్రీమ్ అంటే తెగ అభిమానించేవారు! వాషింగ్టన్ ఒక సందర్భంలో ఐస్‌క్రీమ్ వంటకానికి 200 డాలర్లు వెచ్చించాడట. కాగా తాను ప్రతి రోజు ఐస్‌క్రీమ్ ఆరగించేవాడినని రూజ్వెల్ట్ చెప్పాడు!



ఐస్‌క్రీమ్ తినాలంటే కత్తి, ఫోర్క్ కావాలని ఎప్పుడైనా విన్నారా? టర్కిష్ ఐస్‌క్రీమ్‌ను డోండర్మా అని పిలుస్తారు. దీన్ని చప్పరించడం కాకుండా నమిలి తింటుంటారు. ఈ ప్రత్యేకరకం హిమక్రిమమును మాంసం తగిలించే కొక్కేల మీద వేలాడదీసి కొనడానికి వచ్చిన వారికి దాన్ని కత్తితో కోసి ముక్కలుగా ఇచ్చేవారు!



ఇటలో మార్సియోని ఒక ఐస్‌క్రీమ్ వ్యాపారి. ఇతడు గ్లాసులలో పెన్నీ లిక్స్ అనే పేరుతో ఐస్‌ని అందించేవాడు. అయితే ప్రజలు ఐస్ తినేటప్పుడు గ్లాసులను పగులగొట్టడం లేదా గ్లాసులు తీసుకుని నడుచుకుంటూ వెళ్ళిపోతుండటంతో అతడు దీనికి ఏదో ఒకటి చేయాలని అనుకున్నాడు. ఈ క్రమంలో అతడు శంఖు ఆకారంలోని ఐస్ కోన్‌లను కనుగొన్నాడు. దీనికి 1903లో పేటెంట్ కూడా తీసుకున్నాడు.



కోన్ ఐస్, కప్ ఐస్ మాదిరిగా పుల్ల చుట్టూ ఐస్ చేర్చి తయారు చేసే ఐస్ పాప్ కూడా బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. శాన్‌ఫ్రాన్సిస్కోలో 11 ఏళ్ల బాలుడు గ్లాసులో పుల్లను ఉంచి దాంట్లో సోడా నీటిని నింపాడు. తెల్లవారిన తర్వాత వచ్చి చూడగా కర్రచుట్టూ సోడానీరు గడ్డకట్టి ఉండటం చూసి అతడు గంతులేశాడు.




మొదటి ప్రపంచం యుద్ధ కాలంలో జర్మన్ అధికారి యుద్ధంలో అమెరికా చేరడంపై మాట్లాడుతూ 'ఐస్‌క్రీమ్ తినే జాతికి మనం భయపడనవసరం లేద'ని వ్యాఖ్యానించాడు.

రెండో ప్రపంచ యుద్ధ కాలంలో, తాము కాపాడిన ప్రతి పైలట్‌కి గాను యుద్ధ వాహకనౌకల సిబ్బందికి 20 గ్యాలన్ల ఐస్‌క్రీమ్‌ను బహుకరించేవారు?



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Is everyone fine at home? | Yes, all are fine. |
|---|---|---|
| Telugu | ఇంట్లో అందరూ బాగున్నారా? | అవును, అందరూ బాగున్నారు. |
| Hindi | क्या घर पर सभी ठीक हैं?<br>క్యా ఘర్ పర్ సభీ ఠీక్ హై? | हाँ, सब ठीक हैं।<br>హాc, సబ్ ఠీక్ హై. |
| Tamil | வீட்டில் எல்லோரும் நலமா?<br>వీటిల్ ఎల్లోరుమ్ నలామా? | ஆம், யாவரும் நலம்!<br>ఆమ్, యావరుమ్ నలామ్! |
| Bengali | বাড়ীতে সবাই ভাল আছেন?<br>భరిటే సాబై భాలో ఆచెన్? | হ্যাঁ, সবাই ভাল আছেন।<br>హా, సాబై భాలో ఆచెన్. |
| Marathi | घरातले सगळे खुशाल आहेत ना?<br>ఘరటలె సాగలె కాషల్ అహె ట్ నా? | हो, सगळे खुशाल आहेत.<br>హో, సగలె కుశల్ అహెట్. |
| Kannada | ಮನೆಯಲ್ಲಿ ಎಲ್ಲರೂ ಸೌಖ್ಯವೇ?<br>మనెయల్లి ఎల్లరూ సౌఖ్యవే? | ಹೌದು, ಎಲ್ಲರೂ ಚೆನ್ನಾಗಿದ್ದಾರೆ.<br>హౌదు, ఎల్లరూ చెన్నాగిద్దారె. |
| Oriya | ଘରେ ସମସ୍ତେ ଭଲ ଅଛନ୍ତି ତ?<br>ఘరే సమస్తే వాలా అచ్చాన్తి తా? | ହଁ, ସମସ୍ତେ ଭଲ ଅଛନ୍ତି।<br>హా, సమస్తే వాలా అచ్చాంతి. |
| Gujarati | ઘરે બધા મજામાં છે?<br>ఘరే బాధా మజామ్మాన్ చ్చె? | હા, બધા મજામાં છે.<br>హా, బాధా మజామ్మాన్ చ్చె. |
| Assamese | ঘৰত সকলোৱে ভালে আছেনে?<br>ఘరత్ శకోలోవె భాలె ఆచె? | হয়, সকলোৱে ভালে আছে।<br>హే, సాకొలోవ్ భాలె ఆచ్చె. |
| Malayalam | വീട്ടിലെല്ലാവർക്കും സുഖം തന്നെയല്ലേ?<br>వీట్టిలెఎల్లావరకుమ్ సుఖమ్ థాన్నెయల్లె? | അതെ, സുഖം തന്നെ.<br>ఆథె, సుఖమ్ థాన్నె. |
| Santali | ᱚᱲᱟᱜᱽᱨᱮ ᱡᱚᱛᱚ ᱠᱚ ᱱᱟᱯᱟᱭ ᱜᱮᱭᱟ?<br>ఓదగ్రె జోతో కో నపయ్ గెయా? | ᱦᱚᱭ, ᱡᱚᱛᱚ ᱠᱚ ᱱᱟᱯᱟᱭ ᱜᱮᱭᱟ।<br>హోయ్, జోతో కో నపయ్ గెయా. |
| Sanskrit | गृहे सर्वे अपि कुशलिनः खलु?<br>గృహే సర్వే అపి కుశలినాహ్ ఖలు? | आम्, सर्वे अपि कुशलिनः।<br>ఆమ్, సర్వే అపి కుశలినః. |





| English | What news? | You tell me. |
|---|---|---|
| Telugu | విశేషాలు ఏమిటి? | మీరే చెప్పాలి. |
| Hindi | क्या ख़बर?<br>క్యా ఖబర్? | तुम बताओ।<br>తుమ్ బతాఓ. |
| Tamil | என்ன செய்தி?<br>ఎన్నా సెయిది? | நீ சொல்!<br>నీ సొల్! |
| Bengali | कि खबर?<br>కీ ఖబర్? | आपनि आमाके बलुन।<br>అప్ని అమాకే బోలున. |
| Marathi | काय बातमी आहे?<br>కే బతామి ఆహె? | तुम्ही मला सांगा.<br>తుమి మాలా సంగ. |
| Kannada | ಏನು ವಿಶೇಷ?<br>ఏను విశేష? | ನೀವೇ ಹೇಳಬೇಕು.<br>నీవే హేళబేకు. |
| Oriya | ଖବର କ'ଣ?<br>ఖబరా కానా? | ତୁମେ ମୋତେ କୁହ।<br>తుమ్ మోటె కుహ్. |
| Gujarati | શું સમાચાર છે?<br>సున్ సమాచార్ ఛె? | તમે કહો.<br>తమె కహో. |
| Assamese | কি খবৰ?<br>కి ఖబర్? | আপুনি মোক কওঁক।<br>అపుని మోక కవోక్. |
| Malayalam | എന്താണ് വിശേഷം?<br>ఎంథాను విశేషమ్? | നിങ്ങൾ പറയൂ.<br>నింగల్ పరాయూ. |
| Santali | ᱪᱮᱫ ᱠᱷᱚᱵᱚᱨ?<br>ఛెద్ ఖోబోర్? | ᱞᱟᱹᱭ ᱢᱮ ᱵᱤᱱ।<br>లాయక్ బిన్. |
| Sanskrit | क: विशेष:?<br>కహ విశేషహ? | त्वमेव कथय।<br>త్వమేవ కథాయ్. |



## కళల ఐక్యతాగానం...

పదిరోజులు పాటు కొనసాగిన బెంగళూరు హబ్బా ఉత్సవాల సందర్భంగా కళలు, క్రాఫ్ట్, నాట్యం, సంగీతం, నాటకరంగం, సినిమాలు వంటి విభిన్న రంగాలకు చెందిన వెయ్యి మంది భారతీయ, అంతర్జాతీయ కళాకారులు తమ విశిష్ట చిత్రకళా స్ఫూర్తిని ప్రదర్శించారు.

సాంస్కృతిక యాత్ర అనదగ్గ ఈ అరుదైన ఉత్సవం గత ఏడేళ్లుగా వరుసగా కొనసాగడం విశేషం. ఆర్టిస్ట్స్ ఫౌండేషన్ ఫర్ ది ఆర్ట్స్ (ఎఎఫ్ఎఫ్ఎ) వీటిని నిర్వహించింది.

భారతీయ కళాప్రదర్శనలు, జాజ్ ఈవెనింగ్స్, కళ, క్రాఫ్ట్ మేళా, సృజనాత్మక రచనా వర్క్ షాపులు, బాలల చిత్రోత్సవాలు, ప్రాంతీయ నాటకరంగ పండుగలు వంటి కళలను ఈ ఉత్సవంలో నిర్వహించారు. భారతీయ కళా ప్రదర్శనలో కళా ప్రియులు భారతీయ కళాకారుల కృషిపై ప్రశంసల వర్షం కురిపించారు. మార్కెటింగ్ దాని అమలు సమర్థవంతంగా జరిగే సాంస్కృతిక రంగంలో ప్రైవేట్-పబ్లిక్ యాజమాన్య ప్రతిభకు ఈ ఉత్సవం ఒక చక్కటి నమూనాగా నిలిచింది. కార్పొరేట్ రంగం దీనిని ఆర్థికంగా ఆదుకుంది.

## ప్రాచీన సంస్కృతీ పునరుద్ధరణ



ఢిల్లీ నగరవాసులు తమ భవనాల సాంస్కృతిక వారసత్వాన్ని తిరిగి వెలుగులోకి తెచ్చినట్లయితే, వారి స్థిరాస్థులను హోటళ్లుగా, వాణిజ్య స్థలాలుగా ఉపయోగించడానికి ఇకపై అనుమతి లభిస్తుంది. నగరీకరణ, ఆధునిక వాస్తునిర్మాణం మొఘలుల కాలం నాటి నిర్మాణాలను మరుగుపర్చి వాటి వైభవాన్ని నాశనం చేయగలవని భయపడుతున్న నగర ప్రణాళికా కర్తలు ఈ సమస్యను పరిష్కరించాలంటే ప్రోత్సాహకాలు అవసరమని భావిస్తున్నారు.

ఈ నిర్మాణాల్లో చాలావరకు నివాస ప్రాంతాలు కాగా, కొన్ని దుస్తుల నిల్వ స్థలాలుగా వ్యాపార ప్రయోజనం కోసం ఉపయోగపడుతున్నాయి. ఇలా ప్రాచీన భవనాల పునరుద్ధరణ వల్ల, పాత వృత్తి కళలవారు కాస్త పురోగతి సాధించే అవకాశముంది. వీరు మొఘలుల కాలం నాటి గుమ్మటాలు వంటి నిర్మాణాలలో ప్రత్యేకతను కలిగి ఉన్నారు. ఇప్పుడు వీరు తమ నైపుణ్యంతో రాజీపడకుండానే జీవించే అవకాశం లభిస్తోంది.



# జాబితాలో లేనివాటిని గుర్తించండి










చెరువులో, చెరువు వెనుక అనేక ప్రాణులను చూసి మున్నీ ఆశ్చర్యపోయింది. చెరువులోని కొన్ని ప్రాణులు, వస్తువులు జాబితాలో లేవనే విషయం ఆమెకు తెలీదు. వాటిని గుర్తించడంలో ఆమెకు సాయపడండి.







విదూషకుడు



బీర్బల్

# తిండిపోతు ఎవరు?



1. ఒక రోజు, చక్రవర్తి భోజనశాలలో అక్బర్, అతడి బేగం మామిడిపండ్లు ఆరగిస్తుండగా బీర్బల్ అక్కడికి వచ్చాడు.



2. బేగంను ఆటపట్టించాలని అక్బర్ అనుకున్నాడు. తన పళ్లెంలో మిగిలి పోయిన మామిడి పండు తోలు, ముట్టెను ఆమె పళ్లెంలోకి వంపేశాడు.



3. బీర్బల్ ఇటు చూడు, బేగం ఎంత తిండి పోతో నీకు తెలీదు కదూ?



4. చక్రవర్తి పెద్దగా నవ్వాడు. రాణి సిగ్గుపడి మౌనంగా ఉండిపోయింది.



5. బీర్బల్ చెప్పాడు. హుజూర్, భక్తిభావం కల భార్య తన భర్త అలవాట్లనే అనుసరించవలసి ఉంటుంది.



6. ఏంటీ? ఆమెకు లాగా నన్ను కూడా తిండి పోతు అనుకుంటున్నావేమిటి?



7. బీర్బల్ చెప్పాడు, 'అందుకే నేనలా వ్యాఖ్యా నించాను హుజూర్! నిజం చెప్పాలంటే నిజమైన తిండిపోతు మీరే. రాణి కాదు.'



8. బీర్బల్ చెప్పాడు. 'హుజూర్, బేగం మామిడి పళ్ల రసం మాత్రమే పుచ్చుకున్నారు, మామిడి తోలు, టెంకను ఆమె వదిలేశారు....'



9. 'మీరు మామిడితోలు, టెంకను కూడా లాగిం చేశారు కాబట్టే మీ పళ్లెం ఖాళీ అయింది.' నవ్వు పట్టలేని బేగం చప్పట్లు కొట్టింది.

*మార్చి'11 సుడోకు పజిల్‌కి సరైన సమాధానం ఇక్కడ చూడండి.*

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 1 | 8 | 2 | 4 | 9 | 3 | 6 | 7 |
| 2 | 4 | 6 | 3 | 8 | 7 | 1 | 5 | 9 |
| 7 | 9 | 3 | 1 | 5 | 6 | 4 | 2 | 8 |
| 9 | 8 | 7 | 5 | 2 | 3 | 6 | 4 | 1 |
| 3 | 2 | 1 | 4 | 6 | 8 | 9 | 7 | 5 |
| 4 | 6 | 5 | 9 | 7 | 1 | 2 | 8 | 3 |
| 6 | 5 | 9 | 8 | 3 | 4 | 7 | 1 | 2 |
| 1 | 7 | 2 | 6 | 9 | 5 | 8 | 3 | 4 |
| 8 | 3 | 4 | 7 | 1 | 2 | 5 | 9 | 6 |

## March'11 Winners

1. Venkatesh Bhimrao Sanglikesr
   Kolhapur (Maharashtra) - 416012.
2. Mahat Sehgal
   Hajipi Puth, Mhow(MP).
3. Bijaya Ku Padhan
   Sonepur(Dist), Odisha - 767019.
4. Manmaya Nanda
   Bhubaneswar, Odisha - 751009.
5. C. Maithili
   Uppal, Hyderbad - 500039.

# పాకెడు జంతువులు

ఈ నెల మీకు కొన్ని రకాల పాకెడు జంతువులను అందిస్తున్నాము.

అమెరికా మొసలి



ఊసరవెల్లి



ఉడుము



మొసలి



బల్లి



తాబేలు



CHANDAMAMA (Telugu) June 2011 Registrar of Newspapers of India No. MAHTEL/2010/35912
Licensed to post regd. No. MH/MR/N/126/MBI/10-12